# టి. బాలాజీదాసుగారి హరికథలు

ఆంధ్రదేశమునం దంతటను — సుప్రసిద్ధములగు హరికథలను రచించుటయందును — జనప్రీతికరముగ హరికథలను చెప్పుటయందును సత్కీర్తిని గణించిన శ్రీ బాలాజీదాసుగారి హరికథల యుత్కృష్టత నెఱుంగనివారుండరు. చక్కని భావశుద్ధి — అపూర్వమైనగానము — రసబంధురములగు పద్యములు — కడుపుబ్బ నవ్వించు సందర్భోచిత హాస్యకథలు గల్గిన వీరి హరికథలు సర్వత్ర విశేషప్రచారమును గాంచి యున్నవి. ఇది యొక్కొక్కటి పది మొదలు యిరువది కూర్పులవరకును ముద్రింపబడినవని చెప్పినచో వీనిప్రచారము బోధపడగలదు. వీరియొక్క సంపూర్ణమైన కాపీరైటు హక్కులను మేము గైకొని ముద్రించి అమ్మకమునకు సిద్ధముగ నుంచితిమి. కొలది ప్రతులు మాత్రమే కలవు. ఆలసించి ఆశాభంగమున కెడమీయకుందురని తెలియజేయుచున్నాము.

—• హరికథల వివరము •—

| | | |
|---|---|---|
| 1 | గయోపాఖ్యానము | 0-10 |
| 2 | కుశలవ విజయం | 0-8 |
| 3 | రుక్మాంగద (ఏకాదశీ మాహాత్మ్యము) | 0-8 |
| 4 | జయప్రద లేక పురూరవ | 0-8 |
| 5 | త్రిశంకు విజయము లేక హరిశ్చంద్ర | 0-8 |
| 6 | సీతాకల్యాణం | 0-8 |
| 7 | శశిరేఖాపరిణయం | 0-8 |
| 8 | దయాకర విజయము | 0-8 |
| 9 | సూరదాసు చరిత్ర | 0-6 |
| 10 | పురందరదాసు చరిత్ర | 0-6 |
| 11 | కర్ణానందదాయిని | 0-6 |
| 13 | హరికథేతిహాసమంజరి పద్యములు 1 వ భా॥ | 0-6 |
| 12 | డిటో కీర్తనలు 2 వ భా॥ | 0-6 |
| 14 | కుచేలోపాఖ్యానం | 0-6 |
| 15 | ద్రౌపదీమానసంరక్షణం | 0-6 |
| 16 | సంపూర్ణ రామాయణం | 1-0 |
| 17 | భద్రాచలరామదాసు చరిత్ర — చల్లా రామలింగయ్య విరచితం | 0-6 |

వలయువారు:— సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

శ్రీరస్తు.

# ఛత్రపతి శివాజీ

## హరికథ

రచయిత:


**ములుకుట్ల పున్నయ్యశాస్త్రి**

భాగవతార్.



ప్రకటనకర్త:

**కురుకూరి సుబ్బారావు సన్**

కురుకూరి స్వరాజ్య వెంకట సత్యనారాయణరావు

ప్రొప్రయిటరు:

**సరస్వతీ బుక్ డిపో, విజయవాడ.**





విజయవాడ శ్రీ సరస్వతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది.

**1949**




[వెల రు. 1-0-0

# అభిప్రాయము

మహాపురుషుల జీవితములే దేశోద్ధరణ సాధనములు. అట్టివారి దివ్యచరిత్రములను ప్రజాసమూహమునకు వెల్లడియగునట్లు చేయుటయే కవుల విధాయకకృత్యము.

శ్రీ ప్రసన్నయ్యశాస్త్రిగారు రచించిన విజయభారతం, త్యాగరాజు, నేతాజీ, మహాత్మాగాంధీ, శివాజీ, రాణాప్రతాప, శ్రీకృష్ణదేవరాయలు, క్రీస్తు రాయబారము, భక్తపోతన, వేమన మొదలగు హరికథా గ్రంథములను నేను చదివితిని. కవిత్వము భావపూరితమై సర్వజనాహ్లాదకరముగా నున్నది. కీర్తనలు చక్కని శైలిలో నవరససంభరితములై యున్నవి. ఇట్టి ఉత్తమ భావ ప్రబోధక గ్రంథముల నింకను రచించి భాషాసేవ, దేశసేవ చేయుదురుగాక యని కోరుచున్నాను.

ఇట్లు,<br>
సంగీత సాహిత్య భావసమ్మేళన చక్రవర్తి:<br>
సువర్ణహస్త ఘంటాకంకణ గండపెండేరాది బిరుదాంకితులు :<br>
బ్రహ్మశ్రీ మహావాది వెంకటప్పయ్యశాస్త్రి<br>
గుంటూరు.

# మనవి

సీ. "ఆంధ్రగీర్వాణము ♦ లాకాశ కుసుమముల్"<br>
పంచకావ్యంబుల ♦ పఠనమరుదు<br>
శబ్దార్థ విజ్ఞాన ♦ సంపద శూన్యంబు<br>
గణ యతి ప్రాస ల♦క్షణము సున్న<br>
స్వర రాగయుక్తమౌ ♦ సంగీతమౌ నాస్తి<br>
భరతశాస్త్రము చెవి ♦ బడగలేదు<br>
భావగంభీర శ♦బ్ద ప్రయోగము రాదు<br>
రచనా చమత్కార ♦ రుచి హుళక్కి

గీ. ఇట్టి నాకైత బుధుల మె♦ప్పింపదంచు<br>
నా మదికి తెలియున్నైన భా♦షామతల్లి<br>
సేవజేయుటకై కృషి ♦ జేయుచుంటి<br>
తప్పు లెంచకుడయ్య వి♦ద్వాంసులార!

సర్వధారి<br>
మాఘ పూర్ణిమ

ఇట్లు,<br>
రచయిత

శ్రీరస్తు.



# ఛత్రపతి శివాజీ



## హరికథ



శ్రీరంజని - ఆది

ప॥ నినువినా నాకు! దిక్కెవ్వరమ్మ!
నిఖిలలోక జననీ! — భారతమాత! ॥ని॥

అ॥ అనుపమాన సౌభాగ్యదాయినీ!
అఖిలభరత సామ్రాజ్యోద్ధారిణి! ॥ని॥

చ॥ నీదు దాస్యశృంఖలములు బాపగ
నేను వీరకంకణము ధరించితి

సాదరమతి నన్నేలుము "పున్నయ
శాస్త్రి" మానసవిహారిణి! — శ్రీరంజని! ॥ని॥

మంజరులు

శ్రీరంజిల్లగ వింధ్యకు దక్షిణ - సీమయందున నగంబు
సారమైన దక్కనుపీఠభూమి - జననివాస యోగ్యంబు

పాడిపంటచే తులదూగుచు పదు - నేడవ శతాబ్దమందు
నాడు వెలసె నైజాము నహమ్మదు - నగరము తుల లేచెందు

దానినేలు సుల్తానుబాలుడ - ద్దాన "మాలికంబరుడు" ప్ర
ధానమంత్రి పరిపాలన మందున - దక్షుడు సుకీర్తిపరుడు.

వ. ఆహమ్మదు నగరరాజైన సుల్తాను బాలుడగుటచే మాలికాంబరు డను తురుష్కుడు ప్రధానియై రాజ్యపాలనము నల్పుచుండె. దేవ గిరియాదవరాజుల వంశజుడైన "లుకజీ" యనునొక మహారాష్ట్ర వీరుడు యీ సుల్తానుకడ సైన్యాధిపతిగ నుండెను. ఇతనికి "యశ్లో జీ" యను కుమారుండును, "జీజియా"యను కుమార్తెయు కలరు. లుకజీ తన కుమార్తెయైన జీజియాను "షాజి"యను మహారాష్ట్రున కిచ్చి వివాహమొనర్చి యల్లునింగూడ తానున్నసుల్తాను కొలువు నందే సైన్యాధిపతి యుద్యోగమిప్పించెను. మామయు నల్లుడును అహమ్మదు రాజ్యమును కాపాడుచుండిరి. షాజీకి జీజియాయందు "సాంభాజి" యను కొమారుడు కలిగెను. కొన్నాళ్లకు ప్రధాని యైన మాలికాంబరుడు మరణించెను. నవాబు బాలుడగుటచే రాజమాత పెత్తనము సాగించుచుండెను.

మం జ రి

రాజ్య తంత్రములు నడపుమంత్రి మర - ణంబునొందె నంతటనె
రాజ్యమెల్ల నడువీధిలో కాపు - రంబయ్యె దిక్కుగల్గక నె.

వ. మొగలాయి చక్రవర్తియు, ఢిల్లీపురాధీశ్వరుండునునైన ఔరంగజేబు యెన్నిదినములనుండిరో యీ అహమ్మదునగర రాజ్యమును దిగ ద్రింగ జూచుచుండెను. కాని బలపరాక్రమ సంపన్నులైన లుకజీ,

షాజీలకు భయపడి యౌరంగజేబు మిన్నకుండెను. ప్రధాని మరణించి రాజ్యమల్లకల్లోలమయ్యెనను వార్త యౌరంగజేబు విని లుకజీ షాజీలకు తనివిదీర భాగ్యాశగొల్పి తనకొలువునకు రమ్మని వర్తమానమంపెను. లుకజీ ఆవార్తకు సంతసించి తాను ఔరంగజేబు కొలివునకేగనెంచి షాజీ కిట్లనె. అల్లుడా! మననవాబు బాలుడు, ప్రధాని మరణించె, పెత్తనము రాజమాతగారిది, రాజ్యముతాఱుమాఱైనది. ఔరంగజేబు మనకు గొప్పపదవు లిచ్చెదనని వర్తమానమంపుచున్నాడు. నేనెట్లు మనను పోవ సంకల్పించితిని. నీవునావెంట భార్యాబిడ్డలతో ఢిల్లికి రమ్మని కోరిన షాజీ తాను కొలువున్న నవాబును వదలిపోవుట యధర్మమని యెంచి మామ కిట్లనియె.

శివరంజని _ ఆది

క్షమియింపుమా – జాలినొందెదేల
భ్రమ గల్గెనా – పాదుషా కపట వాక్యముల ॥క్ష॥

సమరరంగ విజయ – సాహసుండవయ్యు
సామ్రాజ్యమును – కాపాడ లేవా? ॥క్ష॥

హానిగల్గునంచు – నదరిపోవనేల
ప్రాణికోటిపుడమి – బ్రతుకునా వేయేండ్లు
మానహీనమైన – వాని జన్మమేల
జ్ఞానమూర్తి! మన – సారయోచించి. ॥క్ష॥

సీ. ఈ నవాబుల కొల్వు • లోన మాయయ్యను
జేర్చి సర్దారుగా • జేసినావు
ప్రభుల యాస్థాన గౌ • రవములలోన నీ
సాటి మర్యాదలు • సలిపినావు

చిన్ననాటనుండి సన్నెత్తి ముద్దాడి
పెంచియు పెద్దగావించినావు
కడుప్రేమచే బిడ్డనిడి పెండ్లిగావించి
కొలువధికారిగా నిలిపినావు
గీ. అట్టినీమాట త్రోయ త ప్పౌను గాని
తరతరంబుల నుండి యా స్థాన ప్రభుల
యుప్పపులుసున బెఱుగుచు నిప్పుడిట్టు
లకట విశ్వాసహీనుల మగుట దగునే?

ఉ. నాకును మీకు యీప్రభు లొనర్చిన దోసమదేమి? పాదుషా
మీకు హితుండె? దామనకు మేలొనరించు నటంచు నమ్మికల్
మీకెటుదోచె? వానిమిడి మేల మెఱుంగమె? యిట్టి మాయలో
నీవు దగుల్కొనక్ వలదు నెమ్మది యోజనచేసి చూడుమా.

వ. అనిన లుకజీ యిట్లనె—

మాల్కోసు - ఆది

వెఱ్ఱిముదిరి వేదాంతివై నాడ
వేమి మూర్ఖమయ్యా!—నానుడి యాలకించుమయ్యా! ॥వె॥

వెఱ్ఱివాడ పిల్ల కాకి యెఱుగున-వింటిదెబ్బ యోజింప లేమబ్బ ॥వె॥

దుడుకుతనము గలవారలన్నమ్మి-చెడిపోవగ సిద్ధమయ్యె నిజాము
విడువడీ రాజ్య మారంగజేబు-వీరినింగూడి చెడిపోవనేల?

మిత్ర

పడకయుండునే ఇనుముతో గలియు -
వహ్ని ఘోరమగు సమ్మెటపోటుల
కడకు మనకొంపకే తిప్పలగును -

గాన ముందుగనె మేల్కొన మంచిదగును ॥వె॥

వ. అనిన పాజీ యిట్లనె—

చ. కదనమునందు శాత్రవని•కాయమునున్ వధియించి రాజ్య సం
పద కడు పెంపొనర్చి మన•భారతజాతిని నుద్ధరింపలే
దది యటులుండ రాజ్యరమ•నంతయు నిన్ను నునన్ను నమ్మి యిం
పొదవగ చేతికిచ్చిన పరి•భూత్తము గొంతునుగోయ న్యాయమా?

చ. మన మహారాష్ట్ర రాజ్యరమ•మగ్గుచు నున్నది శాత్రవాగ్ని కిం
ధనమయి యుద్ధరింపుము"తథాస్తు"ని ఖడ్గము బూనిలెమ్ము పా
ర్థుని యటు దుర్మదోగ్రరిపు•దోర్బలమెల్లను గుర్రింగజేతు కృ
ష్ణుని యటునీవు నూరక యె•చూచుచునుండుము మత్ప్రతాపమున్

మం జ రి

అని వీరోచితమగు నల్లుని పలు–కాలకించి యోచించి
అనువుగాని వేళలల • నధికుల–మనుట వెజ్జియని యెంచి

వ. లుకజీ యిట్టనె—

శ్రీరంజని — ఆది

ఏలనీకు గొంతెమ్మ కోరికలు–చాలింపుము నీబాల్య చాపల్యము
చాల దుర్ఘటంబగు నీయూహల–
సాధ్యంబులు తలపుమించు కార్యము ॥ లే॥
అన్య వైభవాసహనమతులు మన–యార్యావర్తము నందలి హిందువు
లెన్నికలత లేతమలోనన్ తమ–కున్న నొక్కటయ్యెదరు నవాబులు.

మి త్ర

అన్ననాన్న వెనుకముందు లరయక–నాది శూరత్వమును జూపించిన
నెన్న... విజయము లభియించున? ... నీవాంఛితము లీడేరునా?॥ఏ

ఉ. నీమదిలోన వాంఛలు జ♦నించెను వేనకువేలు లాభమే
మీ ? మనపక్క తాళమును♦ వేసెడి నాయకులేరి ? బాలనై
జామిక ముందుముందు మన♦సఖ్యము గోరడటంచు దోచెడిన్
నామది నింతయోజన మొ♦నర్చియె మేల్కొనుచుంటి ముందుగన్

మంజరి

పోయివత్తునని లుకజీ రయమున-బోయి ఢిల్లీని జేరి
హోయిమీర దండనాథుడయ్యెన-రాతికొల్వులో దూరి

వ. లుకజీ తనమాట నల్లుడైన షాజీ వినకుండెనని యాగ్రహించి యాతని నెట్లయిన చంపనెంచి అహమ్మదునగర రాజ్యమును నపహరింతమని ఔరంగజేబును పురికొల్పి యుద్ధసన్నద్ధుడై యహమ్మదునగరమునకు బయలుదేరెను. ఆవార్తవిని బాలుడైన నవాబు తన తల్లితో యోజించి ఔరంగజేబుతో సంధిసేయ నిశ్చయించెను. షాజీ విచారమానసుండై యాబాల సుల్తానున కిట్లనె —

పూరికల్యాణి — రూప

పగబట్టిన త్రాచుబాము-పడగ నీడ పవళింతువె
వెగటుమాని నాహితమ్ము-వినిన మీకు కడుశ్రేయము ॥ప॥
పాదుషా సన్నాహములకు-భయము నొంది సంధిసేయ
పాల్పడి నీవింతనవ్వు-బాట్లకు లోనైతి వకట

మిత్ర

పోదు గౌరవము షాజీ-బొందిలోన ప్రాణమున్న
నాడు రక్తబలి నిచ్చెద-నీదు రాజ్యముద్ధరించెద ॥ప॥

వ. అని షాజీ యెన్నివిధముల బోధించినను సుల్తాను బాల్యచాపల్యమున రాజమాతమాట మీఱజాలక సంధికిచ్చగించె షాజీ చేయు

పది లేక అటుమామకు యిటురాజుకు పగవై విచారమానసమున భార్యయైన జీజియాబాయితో నిట్లనె—

బిలహరి — ఖండ

నామనోరథము లీ। నాటితో గృశియించె
నాయాశ లంతరించె । — స్వాతంత్ర్యము నశించె ॥నా॥

భామరో! నిండార । ప్రేమించు నీతండ్రి
పగదాయయయ్యె నేడు । — పాదుషా కొల్వుకాడై ॥నా॥

మి త్ర

తామసించి పటు సం–గ్రామము ప్రకటించె
యీ మూర్ఖుడు సుల్తా–నిచ్ఛగించె సంధిసేయ ॥నా॥

గీ॥ నెపము తలనిడి, సంధిగా • నీయనంచు
అంపు జేయుచు నుండెనా • రాజమాత
తలకు మీాఱిన యాడపె • త్తనము నందు
కొలువు కంటెను ముప్పె త్తు • కొనుట, మేలు.

వ. అనిన జీజియా యిట్లనె—

మాండు — ఆది

భరతమాతృ సేవార్చన సేయని • భారతీయు బ్రతుకేలా
భరత వీరులై బానిసరాజ్యము • కొలువు సేయగానేలా ॥భ॥

నడుముగట్టి నీ శాత్రవవీరుల • హాత మొనరింపవదేలా
కడుపు మంటకై జోలెకూడు దిన • పౌరుష జాతికి తగునా ॥భ॥

ఉ. ఏ దెట్టులైన నింకమన♦కేమి నిజామెట్టులైన నేమి మా
కాదరమైన మామ మొగ♦లాయి ప్రభుత్వపు బక్షమయ్యె మా
కేది హితంబొ యట్టులొన♦రింపుడు భారతజాతి గౌరవం
బేదిగదాత్రివిదాస్య మొన♦రించుట వీరుని లక్షణంబొకో.

పంజరులు

జీజియాబల్కు వాక్యముల కలరి—షాజీ యానందించి
నాజీవితము కృతార్థత జేసితి—నాతి! హితము బోధించి
తనకు విశ్వాసపాత్రులైనట్టి—యనుచరులు వెంటరాగ
తనయుడు సాంభాజీని చంకనిడి——తరుణిపతి వెంటనేగ

వ. నిండు గర్భిణియైన జీజియాబాయితో షాజి ప్రయాణము సాగించి యరణ్యముల నడచుచుండిరి. ఔరంగజేబు కొల్వుకాడైన లుకజీ అహమ్మదునగర బాలసుల్తానుతో సంధి యొనర్చి యల్లునిపై కోపము దీరక నతడు కుటుంబసహితము వెడలిపోయెనని యెంచి తన సైన్యముల నాతనివెంట నరణ్యమార్గముల నడపించెను. యీసంగతి షాజీ యెఱింగి కోపించి జీజియా కిట్లనె——

మోహన - ఆది

సిగ్గుమాలి నాతో సంగ్రామము। సేయవచ్చె నీ బాంధవద్రోహి
తగ్గశాస్తి జరిగించెద మద్భుజ।దర్పమీనాడు రుచిజూపించెద ॥సి॥

పెంచి పెద్దగాజేసి బిడ్డనిడి । పెండ్లిగావించెనను విశ్వాసము
నుంచి గౌరవించితి నింతదనుక । మంచిపేరు దక్కించుకొనడిసీ ॥సి॥

గీ॥ ఇందనుక శాంత మందితి ♦ నింక నూఱ
కొనుట మంచిదిగాదు నీ ♦. కొడుకును గాని

సాగి పోవుచున్న మీయయ్య ♦ శౌర్యమెంతో
తెలిసికొని నీదు వెనువెంట ♦ గలసికొందు.

వ. భర్త వాక్యము లాలకించి జీజియా శాంతవచనముల నిట్లనె.

శావి — ఆది

మదిలో నింత యోచింపుమా నా
మనవిని యాలింపుమా । శాంతి గనుమా॥ మ॥

సదమల సువిచార! సాగర గంభీర!
సాహసమున కిది । సమయము గాదు॥ మ॥

మిశ్ర

ముదుసలివై మతిచెడిన నాతండ్రి । మూర్ఖమునకు నన్నైనజూచి నె
మ్మదినిదయయుంచియిపుడుసంగరము।మానుమంచు ప్రార్థించుచుంటి॥మ॥

చ. సమయముగాదు యీబలము ♦ జాలదు, సంగరసాధనంబు లే
దు, మొగలసేన నొక్కెడ వె♦దుర్కొన సాధ్యముగాదు, మంచికా
లము మన కెప్పుడబ్బునో బ♦లమ్మును జూపగవచ్చునప్పు డీ
సమరముమాని నా మనవి ♦ శాంతముగా మది యోజసేయుడీ.

వ. అని సమయోచితంబుగ మాటలాడిన భార్య వాక్యంబులకు షాజీ సమ్మతించి శత్రువులకుం జిక్కక మారుత్రోవలంబడి భార్యా కుమారులతో మఱునాడు తెల్లవారుసరికి బిజాపురి సుల్తాను యేలుబడిలో నుండి తన జాగీరు పట్టణమైన "శివనేరు దుర్గము" జేరి ఆ జాగీరును తనకు ప్రతినిధిగా పాలించువాడును, విశ్వాసపాత్రుడునైన "దాదోజీ ఖాండదేవ్" అను బ్రాహ్మణోత్తముని కడకు జని తన మామ దుష్కృత్యం బెఱిగించి నిండు గర్భిణియైన జీజియాను భద్రముగ కాపాడుట కాతని నొప్పించి కుమారుడైన సాంభాజిని

తోడ్కొని తన జన్మభూమియైన "సూపాపురము"న కేగెను. ఇంతలో లుకజీ సైన్యసమేతముగా శివనేకు కరుదెంచి.

మంజరి

అల్లుడు లేడను వార్తవిని కోప । మాపలేక సుతగాంచె
జల్లుమనుచు జిజియా గుండెలదర । జనకుమోము వీక్షించె

వ. జీజియా రోషవాక్యంబుల తండ్రి కిట్లనె—

ముఖారి - ఆది

క్రూరబుద్ధివై యెంతపాపమున । కొడిగట్టితివయ్యా!—
నీకిదితగునటయ్యా!
వీరపత్నినై సంగ్రామమునకు । వెళుతునా కాలహరణ మదేటికి ॥క్రూ॥

నీదుమరియాదనెంచి యిందనుక । నాదరించి గౌరవించె నల్లుడు
లేదునీకు గౌరవముగసాయికి । లేశమైన పరమార్థము గల్గిన ॥క్రూ॥

వినదే యనుము నల్లుని లోపము । నాడుబిడ్డ మోమైనజూడవో
ప్రణయబంధమిటు బోకార్చెదవా ।
పసుపుకుంకుమల కెడజేతువె నన్నింక ॥క్రూ॥

సీ. నవమాసములుమోసి ♦ నన్గన్నతల్లి "మా
ల్యాదేవి" కడుపున ♦ కగ్గిబెట్టి
పెంచి పెద్దగజేసి ♦ బిడ్డనొసంగిన
యల్లుని సంసార ♦ మట్టిగూల్చి
నోరెఱుంగని సుకు♦మారుడౌ సాంభాజి
భావిసౌఖ్యము నేల ♦ పాలొనర్చి
పండిన నాగర్భ ♦ పిండంబు ప్రళయాగ్ని
మంటలలోన భ♦స్మమ్మొనర్చి

గీ. ఆమబిడ్డను నీ విటు ♦ గోడొనర్ప
దలపడితివయ్య! నీ♦కింత దయగలుగదా?
అక్రమముగాదా? పాప భ♦యంబు లేదా?
యింత పచ్చని కొంప మా♦యింపకయ్య!

ఉ. ప్రేమను పెండ్లి పందిటను ♦ పిన్నలు పెద్దలతో సమంత్రకం
బై మహనీయ దివ్యకుసు♦మావళి బూజితమైన తాలిని౯
నా మెడగట్ట జేసితివి ♦ నాడు — కుబుద్ధిని చేతులార నే
డీమె యిదృంప బాల్పడితి♦వే? దయమాలితొ? నన్ను జూడవో?

మం జ రు లు

కడుపు ప్రేవులు౯ మాసిపకునట్లు । కాంతామణి వచియింప
వెడలు కన్నీరు కాల్వలై పాఱ । వేసినిట్టూర్పు బెంప
అక్కున౯ జేర్చి కనుల నీర్దుడిచి । అమ్మా! యని లాలించి
వెక్కి వెక్కి ఏడ్చుచిట్లనె లుకజీ । వెలది మోము వీక్షించి

సావేరి _ ఖండ

శోకింపకుము నింకు । చూలాలవు గదమ్మ!
నా కన్నతల్లి ని । న్నల్లాడ జేసితిని ॥శో॥

నీ కాపురంబిట్లు । చీకాకొనర్చితిని
లోకమున నావంటి । నీచుడెందు౯ గలడె

మి శ్ర

ఈ కరణిని మీ కే । డడ బాటొనరించితి
నా కర్మ ఫలంబే । నన్నుకట్టె కుడుపునుగద ॥శో॥

గీ. కన్నబిడ్డను నిన్ను దుః ♦ ఖాబ్ధిముంచి
నట్టి పాపిని కంట నీ ♦ గ్గెట్టకమ్మ!
కోపతాపాన వాకొంప ♦ కూల్చుకొనగ
తెంపుజేసి మరల తెల్వి ♦ దెచ్చుకొంటి.

వ. నా యింటికేగుదము రమ్మనిన జీజియా యిట్లనె——

మంజరి

ధవుని యాజ్ఞకే నొక్క యనుగైన । దాటుటకు సమ్మతించను
వివరించెను నాయునికి నాథుడే । నెట్లగు నుల్లంఘింప

వ. అని చెల్పిన లూకజీ కుమార్తెకడ సెలవందిపోయెను.

గీ. రాముబాసి వాల్మీకి యా ♦ శ్రమమునందు
నున్న సీతామహాదేవి ♦ యో యనంగ
భర్తసన్నిధికై సదా ♦ పరితపించు
జీజియా నూఱడించె దా ♦ దోజి యిట్లు.

ధన్యాసి - త్రిపుట

అమ్మరో! నీ చరితమంతయు । నాలకించి కన్నీరు నించితి
నెమ్మదిని దుఃఖమ్ము వలదు సు । ఖమ్ముగా కాపాడువాడ ॥న॥

మిత్ర

నమ్మము నామాటలు నీ గ ♦ ర్భమ్మున నపర శివుని యుపతా
రమ్మగలడు నతడు ఱా భార ♦ తమ్మునేలు దిగ్విజయమ్మొనరించు॥

మంజరులు

పాల్మలకు సర్వోపచారముల । బరికొల్పిగ నాయమను
చాలసుఖముగా శివనేరునందు । సాకెను జనకుని వలెను

పతిరాకకు దిన మొక యుగమనగా ! పడతికి కాలముదొర్లె
సుతపోనిధి కణ్వుని కడనున్న శకుంతలయనగా జెల్లె
దాదోజీకడ నివసించుచున్న । తరుణి శుభముహూర్తమున
మోదంబున నీళ్ళాడె దా నొక్క । ముద్దులసుతుని రయమున
పురుడు తీరగనె దాదోజి కదలి । పుత్రోదయ మెఱిగింప
నరిగె సూపాపురమునకు షాజీ । యానందంబును బెంప
రాజచంద్రమా! సుపుత్రప్రాప్తి । రస్తని శుభమువచించె
జీజా సుఖముగ నున్నదియే దాదోజీ ! యని ప్రశ్నించె.

వ. షాజీకి భార్యా కుమారుల క్షేమంబులు దెల్పి దాదోజీ యిట్లనె.

కల్యాణి - రూప

భళిరా! ధన్యాత్ముడవో । బాబూ! షాజీ నరేంద్ర!
వెలసె నీగృహమున సాక్షా । ద్విశ్వమయుడు పరమశివుడు॥భ॥

మిశ్ర

లలిత శుభంకర లక్షణ । లక్ష్మీశుండు దివ్యమూర్తి
ఫలించె మన భారతాంబ । భాగ్యఫలము నిక్కమహో॥భ॥

సీ. శిరమునందున జేజేడు ♦ కరమునందు
ఘనత్రిశూలము, మూడవ ♦ కన్నునుదుట
వలరననసూయనింట పా♦రాడినట్టి
చిట్టిపాపడె మనయింట ♦ బుట్టెనంచు
దోచుచుండె నదృష్ట వం♦శుడవునీవు.

వ. షాజీ యానందించి కుమారునకు "శివాజీ" యను నామకరణ
మొనర్చి దాదోజీని గౌరవించి యిట్లనె.

కేదారగౌళ - ఆది

భారమెల్ల నీ శిరముపై నిడితి। బ్రాహ్మణోత్తమా! యెటు కాపాడెదో
భారతాంబ నోములపంట సుతుని। భావిజీవితార్ణవ నౌక వీవె॥భా॥

నా జాగీరుల రాబడి పెంచుము। నా రాజకార్యముల నడపింపుము
పూజ్యుడా! నా స్వరాజ్యనాటకకు। ముఖ్యసూత్రధారుడవీవె సుమీ॥

వ. అని యాతని నంపి షాజీ బీజాపురసుల్తాను కడకరిగి యచటి మంత్రియైన "మురారి పంతు" అను వాని సాయమున నా కొలువులో గొప్ప సర్దారు పదవి నందెను. కొన్నిదినములకు షాజీ "తుకాబాయి" యను కాంతను రెండవభార్యగా జేకొనియెను. ఆ దినములలో మన దేశము చాలాభాగము దక్షిణము బీజాపురసుల్తాను యేలుబడిక్రిందను, ఉత్తరము ఔరంగజేబు పరిపాలనము క్రిందను నిలచెను. యీ రెండు రాజ్యములలోనే మహారాష్ట్రదేశము జేరియుండెను. నవాబులు మహారాష్ట్రవీరులలో గొందఱకు నుద్యోగములిచ్చియు, కొందఱి కన్నెలను పెండ్లాడియు, కొందఱితో కపటమైత్రిజేసి తమ సైన్యములలో నుంచుకొనియు వారి గౌరవ మర్యాదలు క్రమక్రమముగా నశింపజేసి కడకు నీచస్థితికి దెచ్చిరి. యీ నీచదాస్యంబునకు సహింపని యాత్మాభిమానులకు నా రెండు రాజ్యముల నిలువ నీడలేక నరణ్యములందు, కొండభూములందు వ్యవసాయాది వృత్తులచే జీవయాత్ర సలుపుచుండిరి. అట్టి సమయముననే మహారాష్ట్రులకే గాక భారతమాత దాస్యవిముక్తి యయ్యెనో యన్నట్లు శివాజీ జన్మించెను.

గీ. ఆత్మజుని పూలడోలిక ♦ లందు నుంచి
విమలమైనట్టి భారత ♦ వీరచరిత

జోలలంబాడుకొంచు ను॰య్యాలలూచి
పోరుడుగ తల్లి నిద్దుర ॰ బుచ్చుచుండు.

ఆభేరి _ ఆది

జోజో సుకుమార! జోజో సుశరీర! జోజో భారతవీరా!
జోజో కులదీప! జోజో మదనరూప! జోజో నాచిట్టిపాప!॥జో॥

చిన్నారి పొన్నారి! చిట్టితండ్రివి నీవె! అన్నా! నిదురింపరా
సన్నుత గుణజాల! శాస్త్రీమానవలోల! నాన్నా! పోరేలరా॥జో॥

వ. క్రిమక్రిమముగా శివాజి మైదేండ్ల బాలుడయ్యెను. జీజియా ప్రతి దినమును—

ఉ. నిద్దుర లేపి కన్నుకిచి॰నీరముపోసి వసిక్షా శిరోజముల్
దిద్ది కుమారుతో బయలు॰దేరిలవేల్పు భవాని పాదముల్
తద్దయు భక్తిగొల్చి సత॰తంబు కుమారుని రక్ష సేయుగా
శ్రద్ధవహింపు మమ్మ యని ॰ సాగిలిమొ్రక్కఁగ జేయు పుత్రునిక్షా.

వ. దాదోజి శివాజికి యక్షరాభ్యాస మొనర్చి వ్రాయుట చదువుటయు నేర్పి పదిరెండు వత్సర ప్రాయమునకెల్ల యశ్వ శిక్షణంబును రాజ్యపాలనా విధానంబును, వ్యూహ భేదనంబులును, నేర్పె. శివాజీ తనతోడి బాలుర నొక్కచో జేర్చి—

గీ॥ తాను రాజయి తన సర॰దార్లుగాగ
కొందఱన్నిల్పి రిపుసేన ॰ కొందఱంచు
వ్యూహముల నొడ్డి భేదింప ॰ నుత్సహించి
యూటలాడు శివాజి బా॰ల్యమ్మునందు.

మంజరి

కన్న కుమారుని వీరవిక్రమము । గాంచి తల్లి మదిమెచ్చె
చిన్నకథలుగా పూర్వవీరుల చ । రిత్రంబులు వినుపించె.

వ. ఒకనాడు శివాజీ తోడిబాలురతో నాటలాడుకొని యింటికేగు నప్పటికి తల్లియైన జీజియా గతము తలపోయుచు కన్నీరు గార్చుచున్న నాతండు గాంచి దిగులంది తల్లి కిట్లనె —

కన్నడ — ఆది.

మాతరో! శోకమదేల! మనవివినగదమ్మ! — శాంతము వహింపుమమ్మ!
నీతలంపు నాకెఱిగింపుమమ్మ! నీయాజ్ఞల శిరసావహించెదను ॥మా॥

నన్నుగన్న పుణ్యాత్ముడౌ తండ్రి । పిన్నతల్లియును హాయిగనున్నారె
కన్నతల్లి! యేలోపమైన నే । గావించితినేమో దెల్పుమమ్మ! ॥మా॥

మంజరులు

అనుచు నొడిజేరి పైచెఱగుతోడ । నద్దుచు కన్నుల నీరు
జననీ! శోకింపకు మనుతనయుని । జలజాక్షి యొక్క మారు
కౌగలించి ముద్దాడిబాబు! నన్ గన్నతండ్రి! యేమందు
పగవారలతో నీదుతండ్రి పడు । పాట్లకు మితిలేదెందు.

శా. అన్నన్నా మొగలాయి సైన్యముల దౌష్ట్యంబెక్కుడై భూజనుల్
యెన్నండైనను కంట నిద్రగనిరే? యేనాడు నిశ్చింతగా
తిన్నారా? కవళంబు ప్రాణమరచేతిన్ బట్టి దుఃఖాత్ములై
యున్నారెప్పటి కేమి మూడునో యటంచుత్సాహభంగంబునన్

ఉ. ఆ మహారాష్ట్ర వీరపురుషార్థము నేటికి గొడ్డువోవుట
నీచ మొగలాయివంశ ధరణీశుల యాటలు సాగుచుండె నీ

బాములు బాపి యెన్నఁడు శు•భంబులు గూర్చునో నా భవానితా
నీ మన వంశముల్ మఱల • నెన్నఁడు నుద్ధరణంబు బొనర్చునో.

మంజరి

ఇటు తన మదిలోనున్న సంతాప । మెల్ల వెలిబుచ్చినంత
కటకట పడుచు శివాజితల్లితో । నిటుల బల్కె నిశ్చింత.

మోహన - ఆది

క్రూరకర్మలగు దుర్భరశత్రుల । గూల్చెద వీరవిహార మొనర్చెద
ఊఱడిల్లు దుఃఖింపకుమమ్మరో! యుద్ధరింతు హిందూమత ధర్మము॥క్రూ

మిశ్ర

భారతాంబ దాస్యము విడిపించెద
భవాని పాదార్చన మొనరించెద
మాఱొడ్డిన దుష్టుల వధియించెద
మాతృపితృదేవుల ఋణముదీర్తునిదె ॥క్రూ॥

సీ. అమృతకుంభము దేర • నరుగు ఖగేశ్వరు
వినత ప్రేముడిని దీ•వించినట్లు
కార్తవీర్యు జయింప•గా నేగు భృగురాము
రేణుకాదేవి దీ•వించినట్లు
వైరోచనుని ద్రొక్క • పయనమౌ వామను
ప్రియమార నదితి దీ•వించినట్లు
బకదానవుని జంప • పయనమౌ భీముని
బృథయాదరమున దీ•వించినట్లు
గీ. అనుపమంబగు ప్రేమ నిం•డార నిల్పి
వేదవాక్కుల నన్ను దీ•వింపుమమ్మ!

శత్రు సంహారమున దేశ శాంతి జేతు
నమ్మరో! నీదుమది సంశయమ్ము వలదు.

వ. అనిపల్కిన జీజియా కుమారు నెత్తి ముద్దాడె. ఒకనాడు బీజాపురంబు నుండి షాజీ జీజియా శివాజీలను దోడ్కొని రమ్మని దాదోజికి కబురంపిన నతండు వారల దోడ్కొని బిజాపురంబు చేరిన షాజీ యానంద మొంది కుమారుని ముద్దాడి జిజియా కిట్లనె—

ఆఠాణ - రూప

భళిభళి నాభాగ్యలక్ష్మి! భారతాంబధన్యమయ్యె
విలసిల్లె మహారాష్ట్రము । వీరమాతవైతివహో ॥భ॥

నావంశము నుద్ధరించి । నావు వీరనారీమణి!
నీవాక్యామృత ధారలె । దేవి! మద్యశశ్చంద్రికలు ॥భ॥

వ. శివాజి పదునాలుసంవత్సరంబుల వాడైనంత షాజి తన బందుగులలో జగదేకరావు పుత్రికయైన 'సయీబాయి' యను కన్యను వివాహం బొనరించె. భార్యలైన జజియా తుకాబాయిలతోడను, కుమారు లైన సాంభాజి, శివాజీలతోడను షాజీ యానందముగ కాలము గడపుచు బీజాపుర సుల్తానుకడ గొప్ప సరదారై మన్ననలందు చుండెను. శివాజి తండ్రికి రాజకార్యంబుల దోడు నీడయైయుండె. శివాజి యుదాత్త పౌత్ర సంపన్నవర్తనంబు విని బిజాపురసుల్తా నాతనిం జూడగోరి 'నీకొమారుని యాస్థానమునకు గొనిరమ్మ'న షాజి సంతసించి శివాజిని సభకు రమ్మన నాతడిట్లనె—

తోడి - ఆది

మారు మాటవచియించితినని నీ । మదిలో నాగ్రహమందెదవేమొ
మీరరానిదగును పితృవాక్యము।మీకడదాపగనేల నామతము॥మా॥

మి శ్ర

భారతావనిఁ హరిశ్చంద్రాది । పార్థివోత్తములు ధర్మయుక్తముగ
పరిపాలించిన హైందవుల బ్రతుకు । దానిసత్యమునకు బాల్పడియె
నక్కటా॥ మా॥

చ. అనుకొననే దురుష్కులని ♦ హైందవులంచని భేదమెన్నడే
మనమున నెవ్వరీ ధరణి ♦ పాలనజేసిన సమ్మతంబె, య
ట్లని మతభేదబుద్ధి కడు♦హైన్యముగా బరజాతిపైని పె
త్తనమొనరించు మూర్ఖ సుల♦తానునకేను సలామొనర్తునే?

వ. షాజీ యిట్లనె.

కాపి _ ఆది

మదిలో నింత యోజింపుమా నా
మరియాద గాపాడుమా । వెంటరమ్మా॥ మ॥

పదపడి నీ పల్కు । పల్కులె నిక్కమ్ము
భావింతు నేను త్వర । పడిన సార్థకమా॥ మ॥

అన్నా! విచారింపకు భ...
వాని సత్కరుణ మన । పై నెట్లు గలదో
యెన్నటికైన నీ । యాశయ మీడేర
కున్నా? భారతమాత । కోర్కె ఫలించు॥ మ॥

గీ. పడచువాడవు తొందర ♦ పడకుమన్న!
కలుగవాకొక్క వెన్నెలలు చీ♦కటులు బోయి
బలిమిచే గసుగాయను ♦ పండజేయ
సాధ్యమా? కొంతకాలము ♦ శాంతిగనుము.

వ. అని బోధించి శివాజిని వెంటగొని కొలువుజేరి సింహాసనాసీను డైన నవాబు గద్దియ దాపునకేగి యెదమ మాతాలువంచి మువ్మారు సలా మొనర్చి షాజీ తన పీఠమెక్కెను.

ఉ. అంత శివాజి యాకొలువు♦నందున దిక్కులు బాఱజూచి దా
నెంతయు భీతితోడ నొన♦రించె సలాము శిరంబు నొంప కీ
వింత సభాసదుల్ గనుచు ♦ విస్మయ ముద్రితులైరి తండ్రికిన్
జెంతనె యున్న తాసనము ♦ జేరెను వీరకుమారు డంతటన్.

మంజరి

తన మది మునిముని నవ్వుకొంచు సుల | తాను శివాజినిగాంచి నీ
జనకునివలె మాకొలువులో నిలుము | ఘనయశంబు గడియించి.

వ. శివాజి యిట్లనె —

గీ. పసిడి సింహాసనమున ద♦ర్పాభరొనర్చి
నీవు పరిపాలనము సేయ♦నేను నీదు
పనుపొనర్పెడి కాలము ♦ వచ్చునా? య
టంచు నెంచెద నట్లైన ♦ నదియ శుభము.

వ. శివాజి వాక్యంబులు సులతాను గ్రహింపజాలక నతనికి దుకూల బహుమానమిచ్చి ప్రతిదినము మా సభకు వచ్చుచుండుమని దెల్పిపంపె. ఒకనాటి సాయం సమయమున శివాజి విహారమేగుచు రాచబాటయందున్న నొక్క కసాయి యంగడికడ. నలువురు కిరాతకు లొక గోవును గుదిగట్టి నేలబడద్రైచి చంపయత్నింప నా గోమాత విలవిల తన్నుకొనుచున్నంత శివాజి పరుగు పరుగున వచ్చి,

గీ. లాగి గుదిగాళ్ళు గట్టి నే♦లబడ వైచి
కత్తులన్ గొన్నమృత్యు కిం♦కరుల జూచి
ప్రాణముల నాశవీడి 'అంబా!' యటంచు
కనుల నీర్గార్చు గోమాత ♦ గనె శివాజి.

మం జ రి

తల్లి బాధగని కన్నీరురాల । తల్లడిల్లు లేగను గాంచి
యుల్లమెల్ల గంపించి కిరాతుల । నుగ్రమూర్తియై జూచి

గీ. కనుల వెంబడి బాష్పముల్ ♦ గార పేద
మొగమిడిన తల్లినిన్, దుఃఖ♦మున సుడివడి
యేడ్చు లేగను, గనుడయ్య! యిట్టులెటుల
యముకు బలిగొనజే కఠి♦నాత్ములార!

వ అని యడ్డగించిన వారు భయమొంది.

జంఝోటి _ ఆది

కరుణచె మన్నించు మాదొరా!
కనుపు కస్తూరితి నీ । కర్మము పాలైతిమి। ॥క॥

పరమ నీచుల ము నీ । పాద దాసులమయ్యా!
బ్రతికినన్నాళ్ళు యే । పాపము లొనరింపము ॥క॥

వ. అని పాదములబడి ప్రార్థింప వారలకు కొంత ధనమిచ్చి పంపి యా గోవు బంధములు విప్పి శరీరమందలి ధూళినెల్ల దన యుత్తరీయంబుచే దుడిచి—

గీ. భయము నొందకు దుఃఖింప ♦ వలదు తల్లి!
చిన్నికృష్ణుండు నిన్ను ర♦క్షింపగలడు

పచ్చిక బయళ్లయందున • విచ్చలవిడి
కోరి నీ బిడ్డలే నాడు • కొనగదమ్మ!

వ. శివాజీ గోసంరక్షణం బొనర్చిన విధము నూరెల్ల దెలిసి మనుష్యులు గొందఱు కది వెగటుగా దోప శివాజియందు లేనితప్పులు గల్పించి సుల్తానుకెఱింగించిరి. ఈ యుదంతం బెఱింగి షాజీ తన పుత్రున కేమి హాని గల్గునో యని విచారించి తనకు పరమ మిత్రుండును, ప్రధానామాత్యుండు నైన "అమీరు జుమ్లాఖాన్" వద్దకేగి జరిగిన విధం బెఱింగించి నవాబును ధర్మయుక్తంబుగ బ్రవర్తింపజేయు డన నా యమాత్యుండు కొలువున కేగి నవాబుతో నిట్లనె.

మంజరులు

అరయుము మీ మది ధర్మాధర్మము । లయ్యా! యోజన సల్పి
దురితాత్ముల యాలోచన వినకుడు । పరికింపుడు దయగొల్పి
మన మతగ్రంథములను భూతదయ । మంచిదిగాదనినారే?
జననాయక! యీ ఘోరహింస విని । సాటి ప్రభుత్వము నగరే?

వ. అని వచింప నవాబు సంతసించి.

చ. తులువతనంబునన్ పొగరు • తో నెవడేని యుధేనుహత్యలన్
సలిపిన, వీథులందు నగ • సాయి మకాణములుంచి యమ్మగా
దలకొను వారికిన్ మరణ • దండన దప్పదటంచు శాసనం
బులు నలుదిక్కులన్ బనిచె • భూవరుడెంతటి న్యాయమూర్తియో.

వ. గోహత్యాపాతక మాపిన శివాజీపై యవనులెల్ల కోపించి కుట్రలు బన్నుచు నవాబునకు లేనిపోని తప్పిదములెల్ల దెల్పుచుండ షాజీ విచారమానసుండై యున్నయెడ తన కుమారున కేమి కీడు వాటాదు

నో యని దిగులంది శివనేరు కోటనుండి దాదోజిని రావించి యాతని సమక్షమున జీజియాతో నిట్లనె —

శివరంజని – ఆది.

ఏమని దెల్పుదునో ప్రాణేశ్వరి! ఎంతటి విపరీతముగల్గె నోహో
ప్రేమమూర్తి మన శివుని ధర్మములు
పగటుగాదోచె నీతురుష్కులకు ॥ఏ॥

మిశ్ర

శామసించి లేనిపోనినిందలు । తలగట్టి రాజునకు బోధించిరి
యేమిగానున్నదో భవాని కృప
యెరుగకున్న వారమె యవనుల దుర్బుద్ధి ॥ఏ॥

వ. జీజియా యిట్లనె. నాథా! నే నీ విపరీతము గల్గునని కుమారున కెన్నియో బోధించితిని. యతడు స్వామిత విప్లవము భరింపజాల ననియు, నా వలన తలిదండ్రులకు బాధ గల్గుననియు, నన్ను దూరదేశమున కంపుమనియు, నాతో ననేకమార్లు దెల్పె. మన మట్లొనర్చిన మేలగునేమో యోజింపుడన నా దంపతుల మనోవేదనము గుర్తించి దాదోజి యిట్లనె. అయ్యా! మీకింత విచారమేల శివాజిని నా వెంట నంపుడు. మన జాగీరు పరిపాలనంబున నాకు సాయముగు నన షాజీ సంతసించి శివాజిని రావించి యిట్లనె.

బిలహరి — ఖండ

మనజాగీరును బరిపాలింపుము । మంచిచెడ్డలెల్లను గమనింపుము
తనయా! భాదకు లోనునీడవై । ధర్మమార్గముల ననుసరింపుమా॥మ
కన్నతల్లి నీవెనువెంట నుండు । భాండచేవుడన్నియు దెల్పుచుండు
చిన్నతనపు తొందరపాటు జెంద । కన్నా! దుర్మార్గుల పొత్తుబోకు॥మ

మిత్రి

కన్నబిడ్డలటు బ్రజల పాలించి
గావింపుము గోద్దైవత పూజల
కన్ను తగులు పుల్లలు సుమియువనులు
కనిపెట్టి సంచరించు నా ముద్దులయ్య!

వ. దాదోజీ కిట్లనె—

ఉ. పెంచినవాడ నీవకడు ♦ ప్రేమనునన్ మఱపించి, విద్య నే
ర్పించి ప్రియంబు మీఱదన ♦ యాడు కుమారులలోన మిన్నగా
వించిన యొజ్జ వీవెపృధివీ సుర! యింకను నీ కరమ్మునం
దుంచితి నీనిభారమెటు♦లో భరియించి కృతార్థు జేయుమా.

వ. అంత షాజీ యాజ్ఞంపై—

మంజరుల

అత్తకోడండ్రు ప్రయాణము సల్పి। యందలం బెక్కిరంత
తత్తడిపై నెక్కిరి శివాజియును। దాదోజి వారిచెంత
కఱకుకత్తులం దాల్చి భటులు ముందఱ మార్గము జూపింప
నరుగుదెంచి రాశివనేరుకోట। కందఱు మోదము తెంప.

వ. ఒకనాడు శివాజి తల్లి కిట్లనె—

ఆనందభైరవి — ఆది

కన్నతండ్రి నను వేఱుసేయగా। కారణంబదేమో—
నా కెఱిగింపగదమ్మ!
నిన్ను నన్ను తనదాపునన్ నిలువ। నీక దూరమొనరించెనేమొకో ॥క॥

మి త్రి

ఎన్నడైన తన యాజ్ఞ మీాఱినటి
యించితినో? కాని పోనిపను లే
మన్న నల్పితినో: తనదాపున నే
నున్న గౌరవవిహీనమని యెంచెనేమొ? ॥४॥

వ. అనిన జీజియా శివాజిని బుజ్జగించి నాయనా! నీ తండ్రి వేఱుభావమున నిన్నిటకంపలేదు. గురుదేవుడైన దాదోజి కడ రాజధర్మంబులు నేర్చుకొనుటకై యంపె గాన దాదోజి యెఱింగించు రాజనీతులు శిరసావహింపుమని బోధించె. శివాజి తన తోడి నెచ్చెలులైన రఘునాధరావు, తానాజి మొదలగువారితో గూడి దాదోజి కడ విద్యల నభ్యసించె.

మ ం జ ర లు

వ్యూహరచన, సమరసన్నాహ మా।యుధ విశేషనిపుణమ్ము
సాహసచతురోపాయ పౌఢ స। మ్యక్ప్రయోగలక్షణము
అవిరళంబైన సైన్యశిక్షణం। బాది విద్య బోధించి
శివకుమారు దాదోజి రాజ్యాంగ। ధవుని జేసి నేర్పించి.

భై ర వి _ రూప

ఆలింపుము రాజధర్మ। మన్నా! గుణసంపన్నా!
పాలనాధికారి తండ్రి। వోలె బూజనీయుడు సుమి॥ ఆ॥

జనుల పాప పుణ్యముల వి। చారింపగ దండింపగ
జనియించిన విష్ణ్వంశమె। జగతీ తల నాయకుండు॥ ఆ॥

మి త్రి

మునుకొని గర్వాంధకార। మునను లోకకంటకుడౌ
జననాథుని రాజ్యభ్రష్టుని జేయుట ప్రజల ధర్మ! మా॥

వ. ఒక్కనాడు శివాజి గురుదేవు నాజ్ఞగొని రఘునాధ, తానాజీ మొదలగు మిత్రులతో పయనంబై దేశయాత్ర చేయుచు పల్లెలు, పట్టణములు, గిరిగుహాలు, నిషాదభూములు, దిరుగుచు నందలి ప్రజల కష్టంబుల విచారించి తీర్చుచు—

మ॥ మతభేదంబుల మాపితస్కరుల దు♦ర్మార్గంబునుఁ లంచగాం
డితనంబుఁ గడజేసి కర్షకుల కెం♦తే మేలుగా కోరు వ
స్తుతతిఁ సాయమొనర్చి నాగరికమెం♦తో వృద్ధిగావించి వై
కృత చేకూర్చియు రాక పోకలకు మా♦ర్గౌచిత్యముఁ సల్పినఁ.

గీ. ఇతడు మనపాలిదేవుడే ♦ యీ కుమారు
డే మనకు యేలికైనచో ♦ రామరాజ్య
మనగ సందియమేమి భ♦వాని కరుణ
నా శివాజియె మన ప్రభు♦వౌను గాత.

వ. అని ప్రజలచే కొనియాడబడుచు—

మంజరి

అనుచరులాప్తులు వెంట నడువ భీమానదితీరంబునను
చని చని ముందటగాంచె గంభీర । "సహ్య" మనపర్వతమును

వ. సహ్యాపర్వతప్రాంతమున దిరుగాడుచు నాటవికులట్లున్న మాళవ వీరులను గాంచి జాలినొంది వారిలో పెద్దలందఱ నొక్కచో జేర్చి యిట్లనె—

మాల్కోసు – ఆది

ఉన్నాడా? భగవంతు డెందైన
మన్నచో నిట్టిపాట్లొదవునె మాకు

అన్నన్నా యీ భీకరాటవుల
నడవిజంతువులవలె జరింతురే?
ఉండనిల్లు పండను మంచంబులు
తిండిగుడ్డలే కఱవయ్యెనె యీ
మొండిబండ జీవుల మిముదయగన
కుంఠిన దొరపరిపాలన దౌర్భాగ్యము.

గీ. రాజదుర్మార్గమిక సైప ♦ రాదు దీని
నిర్వహించుట ముఖ్యము ♦ నేను సత్య
దీక్షబూనెద మీర్వైను ♦ దీయకను స్వ
రాజ్యరథమును లాగగ ♦ రండురండు.

మంజరి

అన విని దేహము గగుర్పడగ దా । నాజి యిట్లని వచించె
అనఘ! మాపాలిదేవుడె మీ రూ । పమున సాక్షాత్కరించె.

గీ. స్వర్గసామ్రాజ్య మనదగు ♦ సహ్యభూమి
కీవు దొరవయి గద్దియ ♦ నెక్కుమయ్య!
మేరుధీరులు మావళవా ♦ మేటిదొరల
సాయమున దిగ్విజయమును ♦ సల్పువాడ.

శా. ఈ సుల్తానుల దుష్టపాలనము ఎం♦తే ఘోరమాయెన్ ప్రభూ!
మా సర్వస్వము ధారవోసెదము సు♦మ్మా తామికన్ గొంకకే
వేసాగింపుడు జాతినీతి మత వి♦ద్వేషాంతమున్ జైత్రయా
త్రాసన్నాహము మావళవాదొరల యు♦త్సాహంబు బెంపొందగన్.

చ. అనిన శివాజి సంతసము ♦ నందిమనంబున బాల్యమాది నే
ననుకొనినట్టి వాంఛఫల♦మానటు దోచుచునుండె నంచు మో

జనమొనరించి కొండఅకు ♦ సైనికశిక్షణలిచ్చి యుద్ధ సా
ధనలుగజాశ్వయూథముల ♦ దట్టముగా సమకూర్చెనొక్కచో.

వ. ఈ వార్త శివనేరుకోట యందలి దాదోజి జీజియాబాయి విని సంభ్రమాశ్చర్యములు ముప్పిరిగొనచారుల నంపి శివాజిని రావించి వానితో దాదోజి యిట్లనె—

కాంభోజి - ఖండ

కొండపై దూకు పని । గొఱ్ఱెల విధంబు నీ
దండయాత్రలనన్న!—హానికరముగనన్న ॥కొం॥

దండివీరులు యవన । ధారుణీ పతులతో
భండనము సామాన్యమా!—పులితో చెలగాటమ ॥కొం॥

మిశ్ర

అండ లేనివారము । అసహాయశూరులము
ఆలోచన సేయక! ఆత్రపడబోకుమయ్య ॥కొం॥

శా. విన్నాడర్కసుమి నీ ప్రయత్నములు యేం ♦ మేమోకదుర్కచోద్యముల్
అన్నన్నామనకేల సైన్యములు వం ♦ త్సా! కాల్బలంబుల్ ప్రభుల్
సన్నాహంబులు విన్న హానికరమౌ ♦ చాలింపు నీయుద్యమం
బున్నా పల్లుల నాలకింపుమిక బాం ♦ బూ! చేటువాటిల్లెడిన్.

గీ. అష్టకష్టములంది మీయం ♦ యయ్య నిన్న
మొన్ననే గద యుద్యోగ ♦ మును గడించె
నాబిజాపురికొల్వులో ♦ నాతనికిది
హానియగుగాదె నీదు మూం ♦ లాన తండ్రి!

శా. నీ పాండిత్యము నీదు తెల్వియును నీ ♦ నేర్పున్ బ్రదర్శించి ఢి
ల్లీ పృథ్వీశుల కొల్వునందునను మం♦త్రిత్వంబొ, మీ తండ్రికిన్
బ్రాపైనట్టి బిజాపురీ ప్రభుల ద♦ర్బారందు నుద్యోగమో
నీ ప్రజ్ఞన్ గడియించి కీర్తిగనుమా ♦ నీ కేల రాద్ధాంతముల్.

వ. శివాజీ యిట్లనె—

చక్రవాకము - ఆది

కన్నతండ్రికంటెను నిన్నెక్కుడుగా దలంతునయ్యా! —
నా మనవి యాలింపుమయ్యా! ॥క॥

నన్ను మన్నించి మత్ప్రయత్నముల । కడ్డురాకు మొక్కెదను—
గురునాథ! ॥క॥

మిత్ర

చిన్నతనమాది పెంచి పెద్దగా । జేసి సకల విద్యాబుద్ధు లొసగి
కన్నతెప్పవై గాచు నీ యాజ్ఞ । యెన్నటికి శిరసావహింపకుందునె ॥క॥

గీ. అందలంబెక్కి తూగుటు ♦ య్యాలలూగు
వాంఛయే లేదు యన్యుల ♦ వైభవంబు
గన్గొని సహింపలేకుంట ♦ గాదు కూడు
గుడ్డ కల్గాదు బ్రజలకై ♦ కుందుచుంటి.

శా. దాదా! యెన్నడు లేని యీ పిరికిబో♦ధల్ సల్పుచున్నాడవే
రాదా? భారతజాతికింకను స్వతం♦త్రానంద సౌభాగ్యమే
లేదా? తండ్రికి జాతిగౌరవము పా♦లింపంగ సంకల్పమే
నీదా? నా మదిలోని వాంఛలు భవా♦నీమాత లోకార్థమై.

మధ్యమావతి _ ఆది

ఏమిసేతురో చూచెదర బహు మ
నీ సుల్తానులు నన్ను దుండగము
నామతంబు వారల కయిష్టమై
నా తండ్రికి నపకారమొనరురె ॥యే॥

మి త్రి

ఆమహాఘోరమే యొనరించిన । యరుల రక్తధారా ప్రవాహమున
నీమహాభరత సామ్రాజ్యలక్ష్మికిని యభిషేకోత్సవ మొనరించెదనిక ॥యే

చ. తమనుడి ధిక్కరించి పెడ ♦ దారిని బోయితినంచు మీరదు చి
త్తమున దలంపబోకుడు య♦దార్థ మెఱుంగుడు సాకినట్టి ప్రే
మమఱువబోకు నావిజయ ♦ మంతయు మీ కరుణాకటాక్ష భా
గ్యముగద బాబుజీ! జయము । గల్గగ దీవనలిచ్చి పంపుమా.

వ. అని ప్రార్థించి యాతని దీవనలంది మాతృగృహంబున కేగి జీజి
యాకు నమస్కరించి—

కానడ — ఆది.

దాస్యమే భారతజాతికి । దాపురించెనమ్మా!—దుఃఖమయ మయ్యెనమ్మ!
ఆశలెల్ల నడుగంటె సామ్రాజ్య । మంతరించి పానిసరాజ్యమయ్యె ॥దా

భరతమాతృ సేవార్చనకై నేప్రతి గైకొంటి దాస్యము బాపెద
భరతావనిపై జాతీయజండా । పాదుకొల్పెదను దీవనలిమ్మా ॥దా

వ. అనిన జీజియా కుమారుని కౌగలించుకొని యానందబాష్పంబులు
రాలనిట్లనె—

సీ. ఆడినమాట వే♦దాక్షరంబౌ గాక
యాలోచనలు శుభ♦మౌనుగాక
పట్టినదెల్లను ♦ బంగారమగుగాక
ప్రజల కరిష్టంబు ♦ బాయుగాక
కొండలు కోటలై ♦ నిండుసైన్యములౌచు
నడవులు పట్టణా ♦ లగును గాక
పగతురు వెన్నిచ్చి ♦ పాఱిపోదురుగాక
యాలము నిరపాయ ♦ మగునుగాక
గీ. అనయము భవానితోడు నీ♦డౌను గాక
విజయభేరీ ధ్వనుల్ మింట ♦ వెలయుగాక
ప్రేమ నా దీవనమ్మె శ్రీ♦రామ రక్ష
యగును పట్టాభిషిక్తుడ ♦ వగుము తండ్రి!

వ. అంత శివాజి తల్లి దీవెనం గొని భార్యయైన సయీబాయి సెల వంది సహ్యావనమందు జేరి సర్వయోధులం బురికొల్పుకొని తన తండ్రి కొలువుసేయు బిజాపురి సుల్తాను పరిపాలనమందలి "తోరణ దుర్గ"మను కోట ముట్టడించిన నా దుర్గాధిపతి భయకంపితుండై కోటను శివాజికి యొప్పగించి యీ వార్త నవాబున కెఱింగింప బీజాపురంబున కేగె. అది తెలసి శివాజి నవాబుకు తనపై కోప ముదయింపకుండునట్లు యుక్తిగా నిట్లుత్తరమంపె—

గీ. తోరణాగడమేలు స♦ర్దారు మూర్ఖు
డై చరింపగలేని య♦ల్లరులు ప్రబలె
తమకు వచ్చెడి రాబడి ♦ తగ్గిపోవు
నెంచి మీపెత్తనముననే ♦ యేలుచుంటి.

ఉ. అంచితమైనభక్తి తమ • యాజ్ఞ శిరంబునదాల్చి కోటపా
లించెద శత్రువర్గ మద • లించెద రాబడి వృద్ధిజేసి పం
పించెద స్వామిభక్తి వెల • యించెద మీకిది యిష్టమైన వ్రా
యించుకు నాజ్ఞపత్రి మెది•గించుడు నేస్తము ధారుణీశ్వరా!

వ. అని వ్రాసి యొక్క సేవకునకిచ్చి పంపిన సుల్తాను శివాజి లేఖ విని యాతనియుక్తి దెలియంజాలక తన రాజ్యంబు వృద్ధిసేయు నని యెంచి సమ్మతించె. శివాజి తోరణాదుర్గమందొక నూతనరాజ్యము నిర్మించి సైన్యములను, యశ్వదళమును శస్త్రాస్త్ర సాధనంబులు కొల్లగా సమకూర్చి "రాజగడము" అను పేరు నొక్క రాజ సౌధంబు నిర్మించి తానందుండి రాజకార్యముల నడపుచుండె. శివాజి తండ్రియైన షాజీ రహస్యంబుగా తన కొమారుని దుర్ఘట మైన ప్రయత్నంబులు విని దిగులంది శివాజిని పిలచి మందలింపు మని దాదోజికి యుత్తరమంపె. ఆ సమయమున వృద్ధుడైన దాదోజి ఖాండదేవుకు వ్యాధిగ్రస్తుడై మరణావస్థలోనున్న జీజియా కన్న బిడ్డచందంబున దాదోజికి సర్వోపచారములు చేయుచుండె. దాదోజి మరణావస్థలోనుండెనను వార్తవిని శివాజి శివనేరుకోటకు జను దెంచి గురుదేవునకు నమస్కరించి యాతని మరణావస్థగాంచి కన్నీరు నించి,

శా. షాజీమాత్రము కన్నతండ్రియని వా•చాబల్కుటేగాని దా
దోజీ! తండ్రివిసద్గురుండవని యెం•తో భక్తిబూజింతు ని
న్నాజన్మమ్ముగ నెట్లు మఱ్ఱగల న•య్యా! బాబుజీ! నీ వలెన్
న్నాజాడల్ సరిదిద్దువారలిక యె•వ్వండైన బ్రాప్తింతురే?

వ. దాదోజి శివాజిని తన దాపున జేర్చుకొని శిరంబు దువ్వి యానంద బాష్పంబులు రాల నిట్లనె.

భాగేశ్వరి – ఖండ

కన్నీరు మున్నీరు । గా నేడ్చె దేలనో
కన్నతండ్రీ! దేహ । మెన్నటికి నిలచునా ? ॥క॥

బుద్ధిమంతుడ వీవు । పురుషాగ్రగణ్యుడవు
నుద్ధరింపుము హైంద । వోర్వీలలామ నిక॥

మిత్ర

అద్దిర నీ తల్లి పతివ్రతాశిరోమణి
యెద్దియైన నామెకు । నెఱిగించి యాజ్ఞగొనుము ॥క॥

గీ. అన్న! నవరత్న హేమ సిం • హాసనమున
నెక్కి హైందవ సామ్రాజ్య • మేలునాడు
కనుల నీ వైభవంబును • గాంచనైతి
నంచు చింతిలు చుంటి నే • నాత్మలోన.

గీ. ఏను మరణింతునంచు ద • లింపబోకు
నాయనా! సూక్ష్మరూపున • ననుసరించి
హితుడనై నీకు కర్తవ్య • మెఱుగజేతు
మించి గురురీతి నాశీర్వ • దించువాడ.

వ. అని దెల్పి శివాజీ చేతులం దసువులు బాసిన శివాజి దాదోజీకి యంత్యక్రియ లాచరింపజేసి జీజియా నయీాబాయితో మఱల రాజగడమున కరుదెంచి దండయాత్రకై సమకట్టి సకల సైన్యాంబులం జేర్చి అణ్ణాజి, రఘునాథ, తానాజి, మురారి, నేతాజి, సాంభాజి, బాజీ మొదలగు మావళవనాయకులు సైన్యాధిపతులుగా దండయాత్రకు పయనమై సర్వసైన్యంబుల కిట్లనె.

గీ. ఈ ప్రయాణంబులఁ * నెన్న ♦ డేని పేద
సాదలకు విప్రకోటికి ♦ సాధుజనుల
కబలలకు ధేను దేవాల♦యంబులకును
హాని సల్పిన శిక్షార్హు ♦ లగుదురు సుమి.

వ. అని దెల్పి సైన్యంబుల నడపించి రోహిడ, కాంగారి, లోహగడము, సురగడము, గోశాల, భిర్వాడి, కల్యాణి మొదలగు బిజాపురి నవాబు దుర్గంబులను కొలది దినములలో జయించి యాకోటలు స్వాధీన మొనర్చుకొనుచుండెను. వాడీ పట్టణాధిపతి శావంతుడనువాడు శివాజీకి లొంగి కాన్కబెట్టి తన యింట పెద్దల నాటి నుండి పూజించిన భవానీ ఖడ్గమాతని కర్పించెను. ఆ యుద్ధములో నొక్కనాడు శివాజి దండనాథులలో నొక్కడైన "అబ్బాజీ సోనదేవ్" అనువాడొక తురుష్క సర్దారుని సకుటుంబముగ బంధించి శివాజీ దాపునకు గొనివచ్చిన నతంకు కోపమున సోనదేవున కిట్లనె.

పూరికల్యాణి — ఆది

రాణివాస మర్యాదతెలియంగక । మానినీమణుల చెఱగొనినావా
మానహీనుడా ! స్త్రీలపైన నీ।మగటిమి జూపితివా? తెల్వ్వలేద॥ రా॥

మి శ్ర

ఈ నా శాసనమున కంతరాయ। మొనరించిన హైందవఖండాలుడ
నానిజధర్మము కళంకమొనర్చ।నాడవు నిన్నేమిసేతునో చూడుము॥

వ. సోనదేవుండు భయపడి పొరబడి చేసిన యపరాధమును మన్నింప వేడిన శివాజి శాంతించి యా తురుష్క సర్దారుని గౌరవించి యాతని భార్యనుం గాంచి యిట్లనె.

సీ. మూడు మూర్తులను పా♦ఆడు బిడ్డలుగ ను
య్యాలలూచిన తరు♦ణీ లలామ
పెనుమంటలోఁదూకి ♦ తన పతిభక్తిచే
చల్లార జేసిన ♦ సదయ హృదయ
యమపాశముల జిక్కి ♦ శ్రమ జెందు నాథుని
బ్రతికించు కొన్న సౌ♦భాగ్యలక్ష్మి
పతిప్రాణములను కా♦పాడంగ భాస్కరో
దయమును నిల్పిన ♦ ధన్యచరిత
గీ. అట్టి సాధ్వీమణులను గ♦న్నట్టి తల్లి
పావనాకార సకల సం♦పత్సమేత
భరతమాత మీయట్టి సుం♦దరులగాంచి
అమ్మరో! లోకమున కుపా♦ధ్యాయియయ్యె.

గీ. జీజియా కన్నతల్లిగా ♦ సేవచేతు
నిన్ను పెంచిన తల్లిగా ♦ నేదలంతు
తామసింపకుమమ్మ! స♦ర్దారు తప్పు.
నాదిగా క్షమియింపు పు♦ణ్యాత్మురాల!

వ. అని వేఁడుకొని యా దంపతులను గౌరవించి బీజాపురంబునకంపె. ఒక్కనాడు శివాజి వేఁటకరిగి యొక్కచో "శ్రీరామదాసు" అను భక్తుని దర్శించి యాతనిందన గురువుగా జేసికొని యా మహాత్ముని వలన రాజనీతి, దండనీతి, శిక్షావిధి, మొదలగు సర్వ ధర్మంబు లుపదేశమంది యమ్మహాత్మున కిట్లనె—

మంజరులు

తమ యాజ్ఞ శిరసావహింపుచును । దా క్షాత్ర ధర్మంబు
క్రమముగా జేతు గురుదక్షిణగా । తమకిచ్చితి రాజ్యంబు

నేటినుండి కాషాయ పతాకం । బెత్తించెద నలుదిశల
నాటించెద శ్రీభగవాన్ జెండా । నాపాలిత దుర్గముల

వ. అనిన రామదాసముని యిట్లనె——

సరస్వతి - రూప

సన్యసించు ననుబోటికి । సామ్రాజ్య సుఖంబేటికి
అన్నా! విను నీవే నా । యాజ్ఞన్ పరిపాలింపుము ॥సా॥

కావు లేని గోగణంబు । కైవడి మన భరతభూమి
యేపరించె ధర్మమూర్తి! యీ భారము దీర్పుమయ్య! ॥సా॥

వ. అని సెలవిడి పంపిన——

మంజరులు

చని శివుండు జననికి నర్ధాంగికి ♦ వినుపించె యుదంతంబు
ముని రామదాసు రాజ్యమని చాటు । జనిచెను భటవర్గంబు
అట బీజాపురి రాచకొల్వులో । నలముకొని యొకలకలము
పటుదర్పోన్నత విక్రముడైన శివాజీ కార్యక్రమము.

వ. సుల్తాను సభజేసి తనవారి కిట్లనె——

కామవర్ధని - ఆది

మొన్న మొన్న కన్నులు దెఱచి యెంతొ
మొనగాడై యెదిరించెను కుఱ్ఱడు
అన్నన్నా బొలుడంచు పోరబడి
పోర మాతకు మనపాలికాలు జే ॥పోర॥

ఇంత తెంపు బాలునకెటు గల్గెను
యింతకు మూలము తండ్రియనుకొందు
కొంత కొంత లోలోన సాయమును
గూర్చియుండు దుర్మార్గుడు షాజీ.

మిశ్ర

ఎంత కెంతకే మన మూరకున్న
నియ్యది రాజ్యమునకై ముప్పయ్యెను
అంతరించె మన దుర్గములు వాని
హస్తగతమయ్యె నానాటి రాజ్యంబు ॥మొ॥

వ. అని యేపాపమెఱుంగక నిరపరాధియైన షాజీని బంధించి చెఱ నుంచిరి. ఆ వార్తవిని శివాజి విచారమానసుండై —

గీ. రక్తమాంసంబులెల్ల న♦ర్పణ మొనర్చి
వృద్ధిగావించె తమ రాజ్య♦మెల్ల తండ్రి
యొంత విశ్వాసహీనులో ♦ యేమెఱుంగ
నట్టి సత్యాత్ము జెఱబట్టి ♦ నారలకట.

వ. అంత బీజాపూరు సుల్తానుకడనుండి యొక సేవకుడరుదెంచి సభలో నున్న శివాజి దాపున రెండు లేఖలుంచిన రాజాజ్ఞచే రఘునాథుం డందొక లేఖ నిట్లు జదివెను—

ప్రియమైన శివాజీ రాజునకు – బీజాపుర సుల్తాను వ్రాయునది.

ఉ. చిన్నతనంబునందుగల ♦ పేరుప్రతిష్ఠ దలంచి తండ్రికిన్
వన్నెఘటింతువంచు నరి♦వర్గము నొంచి మదీయ రాజ్య సం
పన్నత వృద్ధిసేతువని ♦ భావమునందు దలంచినాఁడ న
న్నన్న దురాత్ములం గలసి ♦ యాఱడి బెత్తువె రాజ్యమంతయున్.

గీ. వెనుక సంగతి మఱచెద • వింక నైన
సమ్మతిని మాదు కొలువంద • రమ్ము నీవు
గెలుచు దుర్గములెల్ల జా • గీరు నిత్తు
మంత్రిపదమిచ్చి నిన్నాద • రింతు రమ్ము.

ఇట్లు,

"సుల్తాను"

మ ర జ రు లా

అందొక లేఖనుగాని "చిరంజీవి ! వగుచు నాయనా ! శుభము లందు" మని చదువ మొదలిడ శివాజి ! యవతరించె నాసనము చేతులం గట్టి వినయమ్మున దన ! శిరము భక్తితో వంచె నాతఱి ప్రధానమంత్రి షాజియుత్తర మిట్టుల వినుపించె.

మ. వినియేయుందువు రాజనన్ను చెఱలో • వేయించెనంచన్న వా
ర్తను, నీసేతకునేనె మూలమయి సం • గ్రామంబులో దింపి నా
ననిశ శిక్ష రొనర్చినట్లయిన నా • కై నీవు సన్మార్గ వ
ర్తనుడౌ దంచు దలంచి నారలు కుమా • రా ! దీనిమర్మంబిదే.

ఉ. "దోసము లేదు నావలన • దుంపుడు కూల్దగదంచు నే నుప
న్యాసము లెన్ని దెల్పిన వి • నందు గుమారుడ"టంచు నిక్క మో
నా సభలోన దెల్పనొక • డైనను నా మొఱనాలకింపకే
ద్రోసిరి యీ చెఱన్నినుము • తో గల యగ్నికి పెట్టుదప్పునే?

గీ. వలదురా బాబు ! తొందర • పడకుమంచు
నా తలపైన నోరుంచి • వంతుకొటి

చినక మనకొంపకింత నాశము దెచ్చు
కొంటివింతటనైన మేలొ్కానుము తండ్రి!

గీ. అక్కటకువచ్చి నాశ్రమలన్ని దీర్చి
యాత్మశాంతి యొనర్తు వంచాశపడితి
గాని కారానివాసము గల్గునంచు
దలపనైతిని నాయనా! కలనయినను.

ఇట్లు,
నీ శ్రేయోభిలాషి.
షాజీ.

వ. శివాజీ సభవారి నాలోకించి యిట్లనె—

శహాన - ఆది

కాగల కర్తవ్యం బెటొగింపుడు
ఘనమనీషులారా! — సభాసదులార!
సాగించుట మేలాదండయాత్రి
జనకునకై తలనొగ్గుట మేలా ॥కా॥

మిశ్ర

బాగోగు లరయ కొత్రిపడినచో
పాపాత్ములు హింసింపరె చెఱలో
భాగధేయ మెట్లుండునొ తండ్రిని
బయలుపడజేయు మార్గమూహింపుడింక.

వ. అనిన సభికులందఱనేక రీతుల వచించిన శివాజి సభఁ జాలించి యంతిపురికేగి తల్లియైన జీజియా కీవార్తనెఱిగించి కర్తవ్యము బోధింపుమన నామె కొంతతడవు దుఃఖించి తనయున కిట్లనె—

శా. ఆలున్ బిడ్డలఁబాసి ఘోరమగు కా♦రాగార వాసంబునన్
జాలింబొంది గృశించు నా విభునకై ♦ సంతాపమున్ గాంతు నా
స్త్రీలన్ గోల్పడి దాస్యబంధముల ని♦స్సీకంట నీర్వెట్టి దుః
ఖాలన్ మున్గిన కన్నతల్లి భరత♦క్ష్మా దేవికై యేడ్తునా.

శా. అన్ననాన్న మదిలోన సందియ మదే♦లా? యిట్టి మేల్కొడు లె
న్నెన్నోవచ్చుచు బోవుచుంట సహజం♦ బేసుమ్మి కార్యార్థికిన్
ఖిన్నత్వంబున తండ్రిపాట్లకు విర♦క్తిన్ జెంది నీ యుద్యమం
బన్నా! భంగమొనర్పబోకు భవిత♦వ్యం బెట్లు కానున్నదో.

గీ. ఒక్క నీ తండ్రినే చెఱ ♦ నుంచె నంచు
చింతిలెద వేల యవనుల ♦ చేతజిక్కి
యెన్ని మంగళసూత్రాలు ♦ ఈ ధరబడి
నున్నవో మది యోచింపు♦మో కుమారా!

ఉ. ప్రేమను తండ్రి బాధలకు ♦ భీతిలి లొంగితివేని యింకనై
జాము మరాటవీరుల భు♦జంబుల నెక్కి సవారి దోలడే?
ఈ మహారాష్ట్ర సేన నడి♦పింపుము ఖడ్గముబూని వీరసం
గ్రామవిహారివై జయము ♦ గాంచుము దేశము నుద్ధరింపుమా.

వ. అని దెల్పి విచారమానసయైన తల్లి నోదార్చుచు శివాజి యిట్లనె—

దర్బారు - ఆది

భారతాంబ దాస్యవిముక్తికి నా। ప్రాణమైన నర్పింపదలంచితి
వీరనారీ శిరోమణి! జనకుని। విడిపించెద చూడుము నాతమాన॥భా॥

మిశ్ర

కారాగార విముక్తి తండ్రికిఁ । గల్పించి గౌరవించిననఁ సరియె
నారలట్టులొనరింపకున్నను భ•వానిఖడ్గ మొనరించును కర్తవ్యము ॥భా॥

ఉ. పుట్టితి జీజియా కడపు • పున్నెపునోములపంటగాగ చే
గట్టితి వీరకంకణము • గాసిలు దేశము నుద్ధరింపగా
బట్టితి నా భవాని పద•పద్మములమ్మరొ! యింక నన్ను న
ట్టిట్టన నీ నవాబు తర•మే? మన కోర్కెలు దీరకుండునే?

వ. అని తల్లికి దెల్పి సభకేగి సుల్తానున కిట్లు లేఖ వ్రాయించె—

ఉ. వింటిని మీదు లేఖ పృథి•వీవర! నా జనకుండు జైలునం
దుంటయువింటి మీకు మతి•యున్నదొ లేదొ యటంచు చింతలో
నుంటిని యేమనందువొ ని•నుఁ యెదిరించిన వానివీడి యే
తంటకు బోనివానిని వృ•థా జెఱద్రోయుట రాజధర్మమే.

గీ. రణమునన్నిల్చి బాహు బ•లమ్ము జూపి
యోడు గెల్పులు రెంటిని • జూడరమ్ము
అంతియేగాని నీ యాజ్ఞ•లందు కొల్వు
కాని శిక్షించుటొక ఘన • కార్యమగునె.

చ. జనకుని చిక్కబెట్టి చెఱ•సాలను వైచిన నాదుపూన్కి సా
గనిదనియెంచి పిచ్చిభ్రమ • గల్గెనుగాని వచింతు నిక్కమా
జనని భవాని పాదముల • సాక్షిగ భారతమాత దాస్య బం
ధన మెడలింప రక్తబలి•దాన మొనర్చెద ప్రాణమిచ్చెదన్.

ఉ. ఇంత వివాదమేల వచి•యించెద నా కడసారిమాట ని
శ్చింతగ తండ్రినిన్ విడచి • స్నేహమొనర్పదవో మహోగ్ర దు
ర్దాంత దురంత దుస్సహర•ణావనిలో శివఖడ్గధార క
ర్పింతువొ శీర్షమందు తమ•కెయ్యది యిష్టమొ యట్లొనర్పుడీ.

వ. అని వ్రాయించి తన సర్దారైన రఘునాథునకిచ్చి పంపిన సుల్తానా లేఖవిని సంభ్రమాశ్చర్యములొంది యుద్ధమునకు సిద్ధమైన జయ మెట్లు పరిణమించునో యని జంకి షాజీని చెఱవిడపించి యెప్పటి యట్ల తన కొల్వున గౌరవించె నా వార్తవిని శివాజీ, జీజియా సంతసించిరి. శివాజీ భార్యయైన సయీబాయి గర్భము ధరించి.

మంజరి

నవమాసంబులు పోసి శుభదినము | నందు నొక్క సుతుంగనెను
శివరాజతనికి జాతకర్మమును | చేయించెను వేడుకను.

వ. ఆ బాలునకు సాంభాజి యను నామకరణ మొనర్చెను. బాలుడు దినదినాభివృద్ధియై యల్లారుముద్దుగా బెరుగుచుండెను. బీజాపురి సుల్తాను శివాజి తనరాజ్యమందలి యెన్నియో దుర్గములు జయించి తనకు పక్కబల్లెమై యుంటచే నాతని నెట్లయిన మాయోపాయంబున సంహరింపకున్న తన పరిపాలన మడుగంటిపోవునని తలంచి తన యాంతరంగికులైన దండనాథుల రావించి యేకాంతముగ నిట్లనె.

మంజరి

అన్నన్నా ప్రభుభక్తి గల్గు సర|దారు లెందఱో గలిగి
కన్నులు దెఱువని పసివాని బట్ట|కున్నారు భీతిగలిగి.

వ. ఆ మాట విని వారిలో అపజాల్ఖానను నాతఁడిట్లనె.

శంకరాభరణము - ఖండ

అడవి కోతికి నింత । దడజెందెదవ దేల
నాజ్ఞనిడి బంపుమయ్యా! — సందియమొందబోకు॥ మ॥
మడియించుటకో లేక । మాటలో బంధించి
పడవైతు మీ పదములకు । — చూడుము నా తమాష॥ అ॥

మిశ్ర

బుడుతడంచు వాని ను । పేక్షించితి గాని
కడముట్టెను నాతని । కాయువీనాటితోడ॥ అ॥

మంజరులు

అనుచు నభిమాన ముట్టిపడ బల్కు । నపజుల్ ఖానుని గాంచి
వినుతించుచు నా సుల్తానాతని । వీరత్వముగ్గడించి
తలలు పదియునుకు చేతులు నిర్వది । మొలవకుండెనే గాని
కలియుగ రావణుడంతటివాడవు । కదలుము సైన్యములగొని
రాజచంద్రుని పొగడ్తకుబ్బి శివ । రాజు దాపునకు వెడల
ఫౌజు నడిపించె బారులుదీర్చి । బ్రహ్మాండ మెల్ల నడల

వ. ఖానుండు కొలది దినంబులకు సైన్యసమేతముగా శివరాజు కోటకు కోసు దూరంబున విడిసి కోట భేదించి శివాజిని బంధించుట యసాధ్యమని యెంచి సంధి పేర బిలచి బంధింపదలంచి తన రాయబారియైన గోపీనాథ పంతను బ్రాహ్మణుని రావించి తగినకార్యము బోధించి శివాజి కడకంపిన నతడేగి యేకాంతముగా శివాజి కిట్లనె.

బేటకురంజి - త్రిపుట

అన్నా! హితకాంక్షివై నా । విన్నపమాలింపుమా — శుభమాను
చిన్నవాడవు గాన మౌఢ్యము । సేయబోకుము ఖిజురాకుము॥ అ॥

మిత్రి

మొన్న మొన్ననే మీతండ్రికి । బన్నమొనర్చిరి నీకతమున
యెన్నియో ప్రమాదంబులింక।మున్ముందు సంభవంబగు యోజింపు ॥హ॥

గీ. మఱియు ఖానుని సందేశ ♦ మాలకింపు
"మా సహాబులతోడ కల♦హమ్ము మాని
చెలిమి గూర్పంగ సంధిని ♦ సేయ వచ్చి
నాడ దయసేయు మొకసారి ♦ నన్ను జూడ".

వ. అని తమతో దెల్పుమనెనన శివాజి స్నేహపూర్వకముగ గోపీ
నాథున కిట్లనె——

హిం॥ తోడి _ ఆది

ఎన్నడేలేని యిట్టి సెయ్యపుఁ
చిన్నెలతో మాపై జూపుట చిత్రము
విన్నవాడ ఖానుడు నా తోరణ
సన్నాహమునకు చెను డెంచెనంచు ॥ఎ॥

ధీమంతుడవయ్యా! నా పూనికి
తెలియని దేమున్నది మీ జోంట్లకు
గోమాతని దైవత సంరక్షణ
నా మతసిద్ధాంతము నెలకోల్పగ ॥ఎ॥

మిత్రి

నీ మహాకార్యభారము తలపై
నిడుకొంటి దైవసాయమునుగంటే
మీ మహోపకారమున నీ దేశ
ముద్ధరింపజేసెదరని యాసలనుంటే ॥ఎ॥

గీ. సమరవీరులు బ్రాహ్మణో • త్తములు మీరు
భరత సౌభాగ్యమునకు దో•డ్పడుచు నీచ
దాస్యమునుండి బ్రజల ను•ద్ధరణసేయు
మార్గమును జూపుమయ్య! న•మస్కరింతు.

౫. ఆ మాటలాలకించి గోపీనాథుడిట్లనె. నాయనా! రాజ్యతంత్రములు నీ వెఱుంగనివికావు. ఖానుని దుస్తంత్రములు మీ కనుభవమే. యట్టిచో దూతనగు నేనేమని దెల్పుదును? మీ కార్యమునం దప్రమత్తుడవై మెలంగుము భవాని నిన్ను రక్షించుగాక! యని బల్కిన శివాజి సంతసించి గోపీనాథునివెంట దా నొక్కదూత నంపుచు యిట్లొక లేఖనంపె.

"శ్రీ శ్రీ ఖానుగారు మాపై జూపిన ప్రేమకు కృతజ్ఞుడను. మీ సైన్యబలవిస్ఫురణంబుదలంచి తమ దాపున కరుగ భయమొందుచుంటిని. మీ యాజ్ఞకు బద్ధుడనగుట నమ్రతమే. దయయుంచి తా మొక్కరు నా కోటదాపున కేగిన మిమ్ముల దర్శించి మీ యానతి శిరసావహింతును."

ఇట్లు,
శివాజీ.

గోపీనాథుడు దూతతో ఖానుని దాపున కేగి యా యుత్తరంబు ఖానునకు వినుపింప మూర్ఖుడగు నాతండు శివాజి నోడించుట కిదే యదనని నేటి కైదవనాడు వత్తునని దూతతో చెప్పిపంపిన యా వార్త శివాజి విని ఖానుని బరిమార్చుటకు ప్రయత్నము లొనరింపుచుండ గడువుదినంబు వచ్చెనంత శివాజి మంత్రులైన తానాజీ రఘునాథుల రావించి వారల కిట్లనె.

ఉ. ఇన్నిదినంబు లిట్లు శ్రమ • నెంచక దాస్యవిముక్తి సేయ నె
న్నెన్నొ ప్రయాసలన్ బడుచు • నెట్టెటులో నొక యొడ్డుజేరగా
నున్న స్వరాజ్యనావ సుడి • నొగ్గక తీరము జేరునో మహా
త్పన్న తురుష్కతంత్రపు తు•పానున నీరధి మునిగిపోవునో.

ఉ. సంధి యొనర్చినన్ సరియె • సాహెబు, దుండగముల్ దలంచె నా
రంధిని దీర్చి నా యమపు•రంబున కంపెద లేక నాకు చే
టొందిన భద్రపీఠమున • నుంచి కుమారుని రాజ్యలక్ష్మి పెం
పొందంగజేసి హైందవ ప్ర•భుత్వము ధర్మము వృద్ధిసేయుడీ.

వ అని చెప్పి ప్రయాణ సన్నద్ధుడై.

మంజరలు

శిరముపైని యుక్కునిర్మితంబగు । శిరస్త్రాణంబు బెట్టి
శరీరమెల్లను నయోమయపు కవ। చంబు గట్టిగాజుట్టి
యెడమచేత పులిగోళ్ళు ధరియించి । కుడిచేత బాకుబట్టి
నిడుపైన కటిపు కరవాలంబును । వ్రేలాడ నడుముగట్టి
భావగంభీర సువిశాల ఫాల • భాగమున గుంకుమెట్టి
యావీరుడు తన తల్లి కెఱిగింప । నరిగి దండంబుబెట్టి.

వ. శౌర్యభార మెఱిగించిన జీజియా కుమారు నిట్లు దీవించె—

శివరంజని – ఆది.

పోయిరమ్మా శుభమగును నాయనా! భువనేశ్వరి నినుకరుణించు లెమ్మి
హాయిగా శత్రుసంహారంబును । జేయుమయ్యా! దిగ్విజయమగు సుమీ॥పో
కటికవాడుసుమి ఖానుడు నీపై । కన్నుబెట్టినాడు సంహరింపగ
నేటుమెలంగెదో యవనులదాపున।మటుమాయలోన త్తురు పాపాత్ములు॥పో

గీ. అన్న! నేను పతివ్రతనైతినేని
విశ్వకల్యాణ సౌభాగ్య। మెంచి తపము
జేయు తాపసినేనిర•క్షించు నిన్ను
విమలమైనట్టి నాదు దీ•వెనలు తండ్రి!

వ. అట ఖానుడు తనవారినెల్ల వదలి యొంటరియై నిర్ణీత స్థలమునకు వచ్చి యందమర్ప బడిన యాసనమున గూరుచుండి శివకుమారుని రాకకై నిరీక్షించుచుండె నంతలో శివాజి భయము నొందిన వాని వోలె గడగడ వడకుచు మెల్లగా వచ్చుచుండ ఖానుడెదురేగి—

మంజరులు

శివరాజా! దయసేయుమా భయము । జెందెద వదేలనంచు
కవుగింటగ్ గదియించి సంశయము । గాంచి మోసమగునంచు
వెనుకకేగి శివరాజుపై కత్తి । వేయ దాని దప్పుకొని
క్షణములోన పడవైచి ఖాను వక్షమెక్కె శివభూజాని.

గీ. ఓయి పాపాత్మ! మైత్రి యు•న్నాత్రయ బన్ని
మృత్యువున్బిల్చి నాట్యమా•డించినావు
ఇంక నీ యాటలెట్లు సా•గింపగలవు
యవన ఛండాల నీకు ది•క్కేవడు చెపుమ.

శా. జీవంబెల్లను ధారవోసి ప్రభువున్ • సేవించె మాయయ్య మీ
కా విశ్వాసము లేక ద్రోసిరికదా • కారాగృహంబందు నో
రీ! వాచాల! యికెందు బోయెదవు యే•రీ నిన్ను రక్షించు వా
రీ విశ్వంబున సర్వపాపము నివ•ర్తింప నన్నమాజ్ సేయుమా.

వ. అని బల్కుచు శివరాజు ఖానుని వక్షంబు తన పులిగోళ్ళచే జీల్చి వైచి ప్రాణవాయువుల బోద్రోలిన యాతని సేనలెల్ల భయభ్రాంతులై పలాయనమైరి. ఖానుని వధ యందు తనకు సాయమొనర్చిన గోపీనాథుని శివాజి సత్కరించి తన యేలుబడి యందలి హివరే యను గ్రామంబు బహుమాన మొసంగి తనకడ నుంచుకొనియె. ఖానుని మరణవార్త బీజాపురి సుల్తాను విని భయమంది శివాజిని గెల్చుటయం దాశ వదలి యాతని మైత్రిచేయకున్న యెన్నటికైన తనపై దండు వెడలి రాజ్యమెల్ల నాక్రమించుట తప్పదని యెంచి యాతనితో సంధియొనరింపనెంచి తన సర్దారుండును, శివాజి తండ్రియునైన షాజీని బంపనెంచి యాతని కిట్లనె—

మం జ రు లు

శివపతికి మాకు పోరుగల్గుటిక । క్షేమకరంబేగాదు
సవినయంబుగా నతనితో మాకు । సంధికన్న గతిలేదు
కన్నకొడుకతడు మేము మిత్రులము । గాన ప్రేమ మెక్కటియె
యన్నివిధంబుల సంధిసేయ మీరరుగుట నాకోరికయె.

వ. అని సంధిపద్ధతులెల్ల చెప్పి పంపిన షాజీ సంతసించి భార్యయైన తుకాబాయితో కొలది సైన్యములు వెంటరాగ పయన మొనర్చి రాజగడమునకు వచ్చుచు తన రాక కుమారున కెఱిగింపజేసిన శివాజి యానందమున తండ్రి కెదురేగి భక్తిచే నమస్కరించి పిన తల్లికి మ్రొక్కి వారల ప్రేమాసీస్సులంది మంగళ తూర్యారవములు మ్రోయ.

మం జ రి

పాదచారియై శిరమున జనకుని । పాదుకాద్వయము జేర్చి
మోదంబున పల్లకి బెట్టి కోట । ముందునద్దాని దించి

వ వారల రాజ సౌధంబు జేర్చినంత జిజియా నాధుని పాదంబుల వ్రాలి కన్నీరు రాల్చుచుండ షాజీ యామెను బుజ్జగించి యిట్లనె.

ఆభేరి — ఆది

సరసీరుహ । దళలోచనీ! సామ్రాజ్య సౌభాగ్యదాయినీ!
భరతావనీ । వీరమాతవై । చరితార్థవైతి ప్రణయస్వరూపిణీ!॥స
కన్నతల్లి గురుదైవము నీవై । కదన వీరు జేసితివి సుతుని
నిన్ను బోలిన।మాతృదేవతల।కన్నభారతాంబ భాగ్యమేమనందు॥స॥

వ అని యోదార్చి శివాజిని గాంచి నాయనా! బిజాపురి సుల్తానుని సంధి యాజ్ఞగొని వచ్చితిని. నీవు గెల్చిన రాజ్యమంతయు నీకు విడచునట్లును, యేటేట లక్ష మొహరీలు నీ కర్పించునట్లును, మీ రెండు రాజ్యములు స్వతంత్రముగా నుండునట్లును, విన్నవించుమనె గాన నామాట విని నేను జీవించునంత కాలము సులతానుతో యీ పద్ధతులకు సమ్మతించి చెలిమి సేయుము. యీ యేర్పాటులు సంధి పత్రముపై వ్రాయించి నవాబు ముద్రితో నీ కంపించెదనని తెల్పి శివకుమారుండు సమ్మతించె. షాజీ యచ్చట కొన్నిదినంబులుండి మరల బీజాపురమ్మున కరిగి నవాబుచే సంధి పత్రంబు నంపె. కొన్నిదినంబులకు బిజాపురంబునుండి యొక్క సేవకు డరుదెంచి "వేటకై పోయివచ్చు మార్గమధ్యమున మీ తండ్రియైన షాజీ గుఱ్ఱముపై నుండి పడి మృతినొందె" నని శివాజికి విన్నవింప నా వార్తకు శివాజి కుటుంబమెల్ల దుఃఖసముద్రమున మున్గిరి. శివాజి తండ్రికి యుత్తరక్రియ లాచరించెను. అట ఢిల్లీనగరంబున చక్ర వర్తి యగు నౌరంగజేబు ఒకనాడు నిండు కొలువొనర్చి తన సర్దారులలో మేటియైన జయసింగుతో నిట్లనె—

కేదారగౌళ - రూప

మాయ మరాటుని శౌర్యము । మాన్పనిచో బ్రతుకు లేదు
ఆ యధముకు నేటికి పగ।దాయయయ్యె మనపాలిటి॥ మా॥
కదలింపుము రథ గజ తుర।గంబుల కాల్బలము నెల్ల
కదనంబున శివరాజును । వధ సేయుము జయము గొనుము॥ మా॥

వ. అని యుత్సాహవచనంబు లాడి జయసింగు నంపిన నతండు సమస్త వాహినుల బురికొల్పుకొని హఠాత్తుగా శివాజీ రాజ్యమును ముట్టడించిన యా వార్త విని శివాజి యిది యుద్ధసమయముగా దని యోజించి సాటివాడైన హిందూరాజుతో రణమొనర్చుట తగదని యెంచి యేకాంతముగ తాను జయసింగు కడకేగిన జయసింగు సంతసించి శివకుమారుని గౌరవించిన శివాజి యాతని కిట్లనె—

శా. అన్నా! భూపతినై సుఖంచెడి దురా॥శాభావమే లేదు, దే
శోన్నత్యమ్ముకు బెన్గులాడెద హరి॥శ్చంద్రాంబరీషాది రా
జన్యుల్ పాలన సల్పినట్టి భరత॥మాతృదేవి దాస్యంబునన్
గన్నీరొల్కు సహింపలేనయితి ని॥క్కంబింత యోచింపుమా.

మంజరి

అనెడి శివరాజు ధీరచిత్తము మా।తావేశము దిలకించి
మనమందలి యజ్ఞానాంధకార ॥ మమత లెల్ల వర్జించి

వ. జయసింగు యిట్లనె కుమారా! శివరాజా! నీ యుద్యమంబు సర్వోత్తమము. కాని నీవు నా మాటవిని యౌరంగజేబుతో సంధి యొనరింపుము. మీ కిరువురకు నేను సంధిగూర్చెదను నీకు లాభంబు గల్గునన శివరాజు సమ్మతించి యేగిన జయసింగు యౌరంగజేబున

కిట్లు త్తరము లిఖించె. "సార్వభౌమా! శివాజీ మిగుల బుద్ధిబలము గలవాడు. ఆతని మన సామంతునిగా నొనర్చిన దక్షిణదేశమెల్ల మన యేలుబడిలోనికి వచ్చును. త్వరితముగ సంధిపత్రిము నంపు" డని వ్రాసి యా లేఖనొక దూతకిచ్చి ఢిల్లీ పురంబున కంపిన ఔరంగజేబు యీ వార్తవిని యోజించె శివాజిని చూడనెంచి "తక్షణము శివాజిని మన యాస్థానమునకు బంపినచో సత్కరించి యాతనికోర్కె నెరవేర్తు" నని మఱల జయసింగునకు వ్రాయించెను. జయసింగు శివాజిని రప్పించి యా వార్తదెలిపి ఢిల్లీ ప్రయాణంబు చేయుమనియు అచ్చట తన కొమారుడైన రామసింగు నీ కన్నివిధముల సాయపడుననియు దెల్పిన శివాజి వల్లెయని యిల్లుజేరి తానాజీ మొదలగువారల వెంటగొని తన కొడుకైన సాంభాజితో మఱుదినంబునకు ఢిల్లీ జేరెను. అచ్చట జయసింగు కొమారుడైన రామసింగు మార్గంబు జూప శివాజి యౌరంగజేబు దర్బారు జేరెను.

మంజరి

మేలిమిగద్దియ నున్న పాదుషా। మోలను శివాజి జేరి
వ్రాలక నే ముమ్మాఱు సలామొ।నర్చె తీవి బెంపారి

వ. ఔరంగజేబు నాజ్ఞచే రామసింగు శివాజిని సామంతరాజుల వరుసలో గూర్చుండనీక సేనానాయకుల వరుసను గూరుచుండ నియమించెను. ఆ దిన మౌరంగజేబు యేబదవ జన్మదినోత్సవమగుటచే పాదుషా తులాభార మహోత్సవమున నుండి యౌరంగజేబు శివాజిని గౌరవింపడయ్యె. తాను కూర్చుండిన యాసన మర్యాద రామసింగువలన విని శివాజి కోపమాపలేక బిగ్గరగా నెల్లరు విన రామసింగున కిట్లనె.

కమాచి - ఆది

ఎఱుగకుండునే చక్రవర్తి వీరా।రాధ్యనేత శివభూపతి నారవ
మెఱుఁగపనిలేదె మా మరియాదల। నించుకంత తా నెంతదారరైన॥ ఎ॥

హైందవవీరు లుదారగౌరవము। లమ్ముకొని దాసులై జీవింతురె
హిందూమతమున కింతటి నైచ్యము।దేల పౌరుషము మొక్కపోవలెనే॥ ఎ॥

గీ. ఎంత దొరయైన సౌభాగ్య • మెంత యైన
నవనినాథున కిట్టి మ • ర్యాద తగునే
కొలువునకు బిల్వనంపి నగ • బలుకరింప
కి ట్లుపేక్షింప గొప్ప త • ప్పిదము గాదె?

గీ॥ దక్షిణాపథమెల్ల స్వా • తంత్ర్యవీర
విక్రమ విహారమున న • డిపించునట్టి
యీ శివాజీ ప్రభుండు నే • డీకొలువున
దండనాథుల సరసనూ • ర్చుండె నౌర.

గీ. తెలివివచ్చినదాది నా • తలనువంచి
తల్లికిని తండ్రికిని గురు • దైవములకె
గాని యొరులకు మ్రొక్కని • నేను మ్రొక్క
నితడు తలనైన యూచడే • యెంత పొగరు.

వ. అని గర్జింపుచున్న విని యౌరంగజేబు "ఏమది"యని ప్రశ్నింప రామసింగు తాత్కాలికోపశమన వాక్యంబుల నిట్లనె. ప్రభూ! దేవరకొలువు మర్యాద దెలియకుంటచే శివరాజు తబ్బిబ్బుపడి మతి చెడి మాటలాడు చుండెనేగాని వేఱుగాదు యాతని కొక్కింత

విశ్రాంతి యనసరమన పాదుషా వల్లెయని శివాజిని యనుచర సమేతముగ నొక్క యేకాంతమందిరంబున కంపె. యౌరంగజేబు యాంతరంగికులు గొందఱు సార్వభౌమా! శివాజి సామాన్యుడు కాడు యెట్టిలో మనసు జిక్కె వీనిని మనపురంబున దిరుగకుండ యాతడు నివసించు మందిరమునుండి వెలుపల దిరుగనీకుండ చేయుట మేలని దెల్పిన నౌరంగజేబు సమ్మతించి సర్దారుడైన "పౌలాద్ ఖాన్" అను వానిని రావించి నీవు శివాజిని బయట రాకుండ కాపాడుచు నాతడు మాతో మాటలాడవలెనన్న రాయబారి ముఖంబున వార్తలంపు నట్లొనర్చి జాగరూకతచే కావలిగాయు మన నాత డట్లొనర్చె యీ సంగతి శివాజి గ్రహించి—

మంజరులు

తనకు మిత్రులకు నిర్బంధపు కాఁపునిచె బాదుషా యంచు
మనమునం దెంచి కర్తవ్యంబును । వినిచి ధైర్యంబుగొంచు
అన్నలార! మీ రేగుడు నేనొక । యదనుజూచి చనుదెంతు
నన్నివిధములను రక్షణసేయ భవాని గలదంచు నెంతు.

వ. అని వారల నంపి ముఖ్యులగు నొక రిద్దఱం దన దాపున నుంచు కొని తానా బందె తప్పించుకొను మార్గంబు యోజించి తనకొక్క వ్రతముగలదని చెప్పి తన యాంతరంగిక సేవకులచే ప్రతిదినము బైరాగులకు భక్తులకు పిల్లలకును పండ్లు, మిఠాయి దినుసులను పంచుటకు బుట్టలతో తెప్పించి పంచి యిచ్చుచు కావలి వారలకు పారిపోవ నుద్యుక్తుడగునట్లు తోపనీక నమ్మకము బుట్టించి యొక్క నాడు శివాజి తనకు నమ్మకమైన "హీరోజీ" యను సేవకునకు తన ముద్దుటుంగర మాతని చేతనిడి తన పాన్పుపై యా సేవకునిబరుండ బెట్టి తన యుత్తరీయ మాతనికి గప్పి ప్రతిదినము పండ్లు, మిఠాయి

దెచ్చి తన సేవకులకు కర్తవ్యము బోధించి తా నొక బుట్టయం దును, సాంభాజి యొక బుట్టయందును కూరుచుండిరి. భటులు వారిపై నిండుగ పండ్లను మిఠాయిలను గప్పి యెప్పటి యట్లగొని పోవుచుండ కావలియున్న యవన రక్షకభటులు ప్రతిదినము పోవు చుండు ఫలముల గంపలే యని మిన్నకుండిరి. శివరాజు సేవకులు బుట్టలతో రాజవీధులు సందులు గొందులు దాటి చీకటి యగు సరికి విజనంబగు నొక్క స్థలంబున దింపిన శివాజి తన వారితో ప్రయాణంబు సాగించె. తెల్లవారిన తరువాత శివాజికి బదులుగా పడకపై పరుండిన హీరోజి లేచి పడకపై దిండులమర్చి యుత్తరీ యంబు గప్పి తాను వెలుపలి కేతెంచి శివాజికి జ్వరమువచ్చినది మందుగొని తెత్తునని రక్షకభటులకు దెల్పి తనదారి నేగె. కొంత తడవునకు శివాజి పారిపోయెనను వార్త రక్షకభటులకు దెలిసి పడకపై లేకుండుట చూచి వెఱగందె. యావార్త యౌరంగజేబున కెఱింగించిన నతండు పశ్చాత్తాపమందెను. శివాజి తప్పుత్రోవలం బట్టి గోమారునితో కొలది దినంబుల కిల్లుజేరి, తన ఢిల్లీ యాత్రా ఫలితమును తల్లికి విన్నవించి సర్వసైన్యంబుల నొక్కమ్మడి పురి కొల్పుకొని ప్రళయకాల రుద్రునివలె ఢిల్లీపై దండువెడలె. ఆ వార్త ఔరంగజేబునకు తెలిసి సమయము తప్పి వచ్చెనని యొక రాయబార మిట్లంపె.

మంజరి

శివరాజా! నీగెల్చురాజ్యములు। స్వేచ్ఛాధికారివగుచు
నవిచ్ఛిన్నముగ నేలుచు మాదగు। నపచారమును మన్నించుము.

వ. అని సంధి పత్రము వ్రాయించి పంపిన శివాజి తన దండు మరలిం చుకొని తన నగరమే తెంచె. రాజబందుగు లెల్లరు శివాజిని

ములకే యుద్ధయాత్రలు ముగించి పట్టాభిషిక్తుడవై రాజ్యపరిపాలన మొనర్ప్పుచునిన శివరాజు వారల కిట్లనె—

చ. ఇది వఱకే నొసంగితి సహీన ముదంబున సర్వరాజ్య మిం
పొదవగ రామదాస ముని • ముఖ్యునకున్ గురుదక్షిణమ్ము దా
నది వలదంచు బల్కె మునినాథుడు నేనెటు పట్టభద్రుడన
య్యెద నిటుసేయ నాకుదగ • దేగురు ద్రోహము సేయనేర్తునే.

వ. అని చెప్పునంతలో నొక్క భటుండు వచ్చి రామదాస మౌని వచ్చుచుండెనని చెప్ప శివాజి సంతసించి యెదురేగి పూజించి యుచితాసనంబున కూర్చుండ జేసిన గురుదేవుండు శివాజి కిట్లనె—

ఆనందభైరవి — ఆది

అనుమానము నీమదిలో నుంచకు । మన్నా ! శివరాజా ! —
ఆశ్రిత కల్పభూజ !
నిను వరించినది సామ్రాజ్యలక్ష్మి । నింక యేలుకొమ్ము !—
ననుపుము స్వాతంత్ర్యరథమ్ము ॥అ॥

మి శ్ర

మన యిలవేలుపు భవానీమాత । ఘనకారుణ్యామృత వృష్టి బఱపె
యొనరింపుము దుష్టశిక్షణాశ్రిత । జనపరిపాలన ధర్మమూర్తివై ॥అ॥

ఉ నందియమేల నీమదికి • సర్వము మిథ్యయటంచు నమ్మి యా
నందముగా మహాటవుల • యందున కాలము బుచ్చునాకు యీ
బంధనమేల నోయి ! వెఱివాడ ! భవాని దయారసంబు నీ
యందున గల్గె నేటికి రక్షయుంబున నీవిక గద్దె నెక్కుమా.

గీ. నాడు రాజ్యము గురు దక్షి ♦ ణార్థముగనొ
సంగితివి నాకు, నేడు నా ♦ శాసనమున
పట్టభద్రుండ వై పరి ♦ పాలనంబు
సలుపు మనుచుంటి గుర్వాజ్ఞ ♦ తొలగసగునె.

వ. అని సమ్మతింపజేసిన (క్రీ. శ. 1596 ఆనందనామ సంవత్సర జ్యేష్ఠ శుద్ధ త్రయోదశి బుధవారం) శుభముహూర్తమునపట్టాభిషిక్తుండై మాతృదేవతకు నమస్కరించిన జీజియా కుమారుని గాగలించుకొని యానంద బాష్పంబులు రాల దీవించి యిట్లనె—

గీ. శాంతవర్తనమున బ్రజా ♦ స్వాంతములను
తెలిసి పాలింపుమయ్య ! ని ♦ ర్మలమనమున
సకల దిక్కుల త్వద్యశ ! శ్చంద్రికలను
వెలయజేసి నూరేండ్లు ♦ జీవించుమయ్య !

మంగళమ్.



# శ్రీ ఆదిభట్ట నారాయణదాసుగారి హరికథలు

"శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణిః" అని సంగీతము విశ్వమోహనజనకమని యార్యులు నిర్వహించియున్నారు. భగవంతుడు గానలోలుడు. శాస్త్రోక్తమగు మృదుమధుర గానమునందు భగవానుడంతర్హితుడై లయమగుచున్నాడు. వాని యెట్టయెదుట భగవంతుని గానభక్తిపాశములచే బంధించి తాండవింపజేయ గలిగిన సంగీతమును రచింపగల సామర్థ్య మెట్టికవికి గల్గును. అది యందరకును సులభసాధ్యమా? కల్ల—అట్టి సమర్థతావిశేషము పూర్వజన్మ సంస్కారము ననే కవికి లభ్యమగును. మన ఆంధ్రదేశమునందట్టి యపూర్వశక్తి సమన్వితు డొక్కడుమాత్రమే కలడు. విజయనగర సంగీత కళాశాల ప్రిన్సిపలును అష్టభాషాప్రవీణుడును అష్టభాషాకవియు - వీణ మృదంగము, లయయందు, గాత్రగానమునందు సర్వసమర్థతగల్గిన విజయనగరవాస్తవ్యులగు సువర్ణ ఘంటాకంకణ హస్తులగు శ్రీమదజ్జాడాదిభట్ట నారాయణదాసుగారు - వీరికవితాధార భగవంతుని హృదయమును ద్రవింపజేయగల మృదుపదలాలిత్యముగల మకరందధారా సమానమై యుండును. ఆంధ్రభాషయం దుత్కృష్టసమర్థత గలిగినవారు. ఇట్టికవి వ్రాసిన భగవత్సంకీర్తనములయందు భగవంతుడు లయీభూతుడగు ననుట కాశ్చర్యమేమి? ఇంతవరకును ఆంధ్రభాషయం దిట్టి హరికథలు పుట్టియుండలేదు. ఈ గ్రంథములు లభింపక చిరకాలమునుండియు పాఠకులు శ్రమపడియుండుటచేత వారి శ్రమలను వాసదలచి, గ్రంథకర్తగారికి 1900 రూప్యములను బహుమానముగ నొసంగి సర్వహక్కులను గైకొని వారి ఛాయాపటముతో గూడ ముద్రించియున్నాము. ఇవి యెనిమిదియు గలసిన క్యాలికో బైండు వెల రు 6—0—0,

| | | | |
|---|---|---|---|
| 1 జానకీశపథము | 1-0-0 | 5 అంబరీషచరిత్రము | 0-8-0 |
| 2 రుక్మిణీకళ్యాణము | 0-12-0 | 6 భీష్మచరిత్రము | 0-8-0 |
| 3 మార్కండేయచరిత్ర | 0-12-0 | 7 గజేంద్రమోక్షము | 0-8-0 |
| 4 హరిశ్చంద్రోపాఖ్యానం | 0-12-0 | 8 ప్రహ్లాదచరిత్రము | 0-8-0 |

గీ. నాడు రాజ్యము గురు దక్షి॥ణార్థముగను
సంగితివి నాకు, నేడు నా॥ శాసనమున
పట్టభద్రుండ నై పరి॥ పాలనంబు
సలుపు మనుచుంటి గుర్వాజ్ఞ॥ దొలగనునె.

వ. అని సమ్మతింపజేసిన (క్రీ. శ. 1596 ఆనందనామ సంవత్సర జ్యేష్ఠ శుద్ధ త్రయోదశి బుధవారం) శుభముహూర్తమునపట్టాభిషిక్తుండై మాతృదేవతకు నమస్కరించిన జీజియా కుమారుని గౌగలించుకొని యానంద బాష్పంబులు రాల దీవించి యిట్లనె—

గీ. శాంతవర్తనమున బ్రజా॥ స్వాంతములను
తెలిసి పాలింపుమయ్యా! ని॥ర్మలమనమున
సకల దిక్కుల త్వద్యశ। శ్చంద్రికలను
వెలయజేసి సూక్షేంస్థ॥ జీవించుమయ్య!

మంగళమ్.



# శ్రీ ఆదిభట్ట నారాయణదాసుగారి హరికథలు

"శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణిః" అని సంగీతము విశ్వమోహనజనకమని యార్యులు నిర్వహించియున్నారు. భగవంతుడు గానలోలుడు. శాస్త్రోక్తమగు మృదుమధుర గానమునందు భగవాను డంతర్భూతుడై లయమగుచున్నాడు. వాని యెట్టయెదుట భగవంతుని గానభక్తిపాశములచే బంధించి తాండవింపజేయ గలిగిన సంగీతమును రచింపగల సామర్థ్య మెట్టికవికి గల్గును. అది యందరకును సులభ సాధ్యమా? కల్ల–అట్టి సమర్థతావిశేషము పూర్వజన్మ సంస్కారము ననే కవికి లభ్యమగును. మన ఆంధ్రదేశమునందట్టి యపూర్వశక్తి సమన్వితు డొక్కడుమాత్రమే కలడు. విజయనగర సంగీత కళాశాల ప్రిన్సిపలును అష్టభాషాప్రవీణుడును అష్టభాషాకవియు – వీణ మృదంగము, లయయందు, గాత్రగానమునందు సర్వసమర్థతగల్గిన విజయనగరవాస్తవ్యులగు సువర్ణ ఘంటాకంకణ హస్తులగు శ్రీమదజ్జాడాదిభట్ట నారాయణదాసుగారు – వీరికవితాధార భగవంతుని హృదయమును ద్రవింపజేయగల మృదుపదలాలిత్యముగల మకరందధారా సమానమై యుండును. ఆంధ్రభాషయం దుత్కృష్టసమర్థత గలిగినవారు. ఇట్టికవి వ్రాసిన భగవత్సంకీర్తనములయందు భగవంతుడు లయీభూతుడగు ననుట కాశ్చర్యమేమి? ఇంతవరకును ఆంధ్రభాషయం దిట్టి హరికథలు పుట్టియుండలేదు. ఈ గ్రంథములు లభింపక చిరకాలమునుండియు పాఠకులు శ్రమపడియుండుటచేత వారి శ్రమలను వాపదలచి, గ్రంథకర్తగారికి 1900 రూప్యములను బహుమానముగ నొసంగి సర్వహక్కులను గైకొని వారి ఛాయాపటముతో గూడ ముద్రించియున్నాము. ఇవి యెనిమిదియు గలసిన క్యాలికోబైండు వెల రు 6—0—0,

| | | | |
|---|---|---|---|
| 1 జానకీశపథము | 1–0–0 | 5 అంబరీషచరిత్రము | 0–8–0 |
| 2 రుక్మిణీకళ్యాణము | 0–12–0 | 6 భీష్మచరిత్రము | 0–8–0 |
| 3 మార్కండేయచరిత్ర | 0–12–0 | 7 గజేంద్రమోక్షము | 0–8–0 |
| 4 హరిశ్చంద్రోపాఖ్యానం | 0–12–0 | 8 ప్రహ్లాదచరిత్రము | 0–8–0 |

వలయువారు:—సరస్వతీ బుక్ డిపో, విజయవాడ.

# ములుకుట్ల పున్నయ్యశాస్త్రి భాగవతారుగారి

—♦ హరికథలు ♦—

ఆంధ్రదేశమునం దంతటను — సుప్రసిద్ధములగు హరికథలను రచించుటయందును — జనప్రీతికరముగ హరికథలను చెప్పుటయందును సత్కీర్తిని గడించిన శ్రీ ములుకుట్ల పున్నయ్యశాస్త్రిగారి హరికథల యుత్కృష్టత నెఱుంగనివా రుండరు. చక్కని భావశుద్ధి - అపూర్వమైన గానము - రసబంధురములగు పద్యములు - కడుపుబ్బ నవ్వించు సందర్భోచిత హాస్యకథలు కల్గిన వీరిహరికథలు సర్వత్ర విశేష ప్రచారము గాంచి యున్నవి. వీరియొక్క సంపూర్ణమైన కాపీరైటు హక్కులను మేము గైకొని ముద్రించి అమ్మకమునకు సిద్ధముగ నుంచితిమి. కొలది ప్రతులు మాత్రమే కలవు. ఆలసించి ఆశాభంగమున కెడమీయకుందురని తెలియజేయుచున్నాము.

---

# క్రొత్తగా వెలువడినవి

—:o:—

ములుకుట్ల పున్నయ్యశాస్త్రి భాగవతార్ గారిచే రచియింపబడిన

—♦ హరికథలు ♦—

| | | | |
|---|---|---|---|
| నేతాజీ | 1-0-0 | వేమనయోగి | 1-0-0 |
| క్రిష్ణరాయబారం | 1-0-0 | భక్తపోతన | 1-0-0 |
| మహాత్మాగాంధి | 1-0-0 | మాయాసుభద్ర | 1 0-0 |
| శ్రీకృష్ణదేవరాయలు | 1-0-0 | భక్తత్యాగరాజు | 1-0-0 |
| శివాజీ | 1-0-0 | విజయభారతం అను (సంపూర్ణ భారతం) | 4-0-0 |
| రాణాప్రతాప్ | 1-0-0 | | |

వలయువారు:—

సరస్వతీ బుక్ డిపో, విజయవాడ.